*"Our hot defence of our ideas and beliefs does not indicate an established confidence in them but often half distrust, which we try to hide from ourselves, just as one who suffers from fashfulness offsets his sense of inferiority and awkwardness by rude aggression."*

ఈ నాటకం కళాప్రయోజనాన్ని ఆశించి వ్రాసింది మాత్రం కాదు. ఇది ఎక్కువమంది సాహితీపరుల దృష్టిని ఆకర్షించకపోవచ్చు కారణం వినూత్న శిల్పంగాని, రచనా చమత్కృతిగాని యిందులో లేకపోవటమే నంటాను. పల్లెటూళ్లలో ఒకనాడు రేగిన తుపాను ఈనాటకానికి మూలం. వాస్తవాన్ని వాస్తవరూపంలో చిత్రించటమే సాహిత్యాన్ని బ్రతికించటం. అదే యిందులో జరిగింది. ఏవిధమైన మెరుగులు మెరువులు ఉపయోగింప బడలేదు యిందులో. నాటకం మానవ జీవితాన్ని చిత్రించాలి అనేవారిముందు ఈ నాటకం ఉంచుతున్నాను. ఇందులోని పాత్రలకు ప్రాణంవుంది. జీవచ్ఛవాలు ఏమాత్రం కాదు. కనకనే ఈ నాటకం మీ అందరికోసం.



'శార్వరి'

# నిజానిజాలు

*

పల్లెటూరి రాజకీయ జీవితాన్ని
యథాతథంగా చిత్రించే నాటకం

*

1953

ఠాగూర్ జనరల్ స్టోర్సు - తెనాలి
కళావాణి పబ్లికేషన్సు - తెనాలి

## 'శార్వరి' రచనలు

| | |
|---|---|
| స్వర్గసీమ | కథలు |
| ఎఱ్ఱభూతం | ,, |
| మమకారం | ,, |
| నయాంగరా | ,, |
| నిజానిజాలు | నాటకం |
| బ్రతుకుబాట | ,, |
| పిచ్చిలోకం | ,, |
| వైతరణి | నవల |
| పరిత్యక్త | ,, |
| రోదసి | కావ్యం |

# ఇందులో...

* వనజ
* మాధవయ్య
* వెంకడు
* గోపాలరావు
* పాపయ్య
* పంతులు
* ముకుందరావు

# మొదటి రంగము

ఎన్నాట్లో నీ కళ్ల ఎలుగు సూడాలి
ఏటిగాలుల మీన ఎగిరి పోవాలి
నా మనసు నీ మీన నిలచి పోయింది
మనసులో మమతేదో దిగులు సోకింది.

మాధవయ్యగారి పెద్ద లోగిలి. ముందు పంచలో
వెంకడు కూర్చొని తాడు పేనుతూ వుంటాడు.

వెంకడు:- దీని తస్సాదియ్యా, మెలిక పడదేం సరిగ్గా.........
'ఎన్నాట్లో నీ కళ్ల ఎలుగు సూడాలి...(పాడుతుంటాడు)

పాపయ్య వచ్చి నిలబడి వెంకడి వాలకం చూస్తూవుంటాడు.

వెంక- అదిగదీ...అట్టా తిరగాలి... నా మనసు నీ మీద

పాపయ్య- ఎవరి మీద, నా మీదే......

వెంక- ఆ! మీరా......రండి దొరగారు...నిలబడే వున్నారేం, కూచోండి.

పాప- ఏం మనసా ఏహో జోరుగా వుందే... 'నా మనసు నీ మీద' ఎవరోయ్, ఎవరిమీద నీ మనస్సు......ఏమిటి అయింది?

వెంక- ఏం లేదండీ...అదేదో మొన్న బస్తీకాడ ఎవరో పాడుతుంటే వినబడ్డది. మా బాగుందండి ఆ పాట.

పాప- అంత బాగుందా...

వెంక— అచ్చం సినిమా పాటలాగా వుంది కదండీ!

పాప— అదే అనుకున్నాను నేనుకూడా...బాబుగారున్నారా లోపల...

వెంక— బాబుగారండీ!... లేరండి...

పాప— బాబుగారుంటే 'నేనీ పాట లెందుకు పాడతా' నంటావ్ అవున్లే గాని, ఎక్కడికి వెళ్ళారు?

వెంక— అరుగు మీద కెళ్ళే రండీ....

పాప— అన్నం భోంచేశారా?

వెంక— మరేనండి...ఇప్పుడే చేశారండి... అట్టా చుట్టకాల్చు కుంటూ వెళ్ళిపోయారు...

పాప— వస్తాను...

వెంక— వెళ్ళి పిల్చుకు రమ్మంటారా?

పాప— ఆ! నేను వెళ్తానుగా...అరుగు దగ్గరే వుంటారుగదూ!

వెంక— ఓ...తప్పకుండా వుంటారు ... మీా రిక్కడే వుండండి. వున్న పాళాన వెళ్లి పిల్చుకు వస్తాను. (పోబోతాడు)

పాప— వెంకడూ!

వెంక— ఆఁ.

పాప— ఆట్లారావోయ్ వెధవనాగన్నా...నే పోతానంటే నువ్వు పరుగు లంకించుకుంటావేం...కూచుని ఆ తాడు పేనుకో.

వెంక— మీారు కూచోండి బాబూ...నే వెళ్లొత్తానుగా.

పాప— నీ పనేదో నువ్వు చూచుకోవోయ్... ఇట్టన్నా పని తప్పుతుందని నీ యేడుపు......

వెంక— వెంకడు అట్టాంటోడు కాదండోయ్. మీ రేమో అను కున్నారుకామోలు. పనంటే ప్రాణంతోటి సమానం ఈడికి. మా దొరగారికి తెలుసుగా నా విషయం.

పాప— తెలుసు... తెలుసు...

వెంక— అయ్యగారు ఆడే వుంటారు పోండి. నే పనిచేసుకోవాలి.
(పాపయ్య వెళ్ళిపోతాడు)

వెంక— "మనసులో మమ తేదో దిగులుసోకింది" ఈ పాపయ్య గాడి పని ఎంత మజాగ్గావుంది. నాలుగుసార్లు బస్తీ కెళ్ళి ఇస్త్రీబట్టలు వేసుకోగానే మగాడైపోయాడన్నమాట... ఇట్టావుంది లోకం.

ఓ హూ...హూ... ట్యూన్ పాడుకుంటూ గంతులేస్తూ వస్తుంది వనజాక్షి. చలాకీపిల్ల. అందంగా వుంటుంది. వయస్సు ఇరవైకి లోపు. ఇంకా పెళ్ళికాని బిరుసుతనం. సన్నగా వున్నదేమో మహా చలాకీగా ఎగురుతుంది.

వన— ఓహూహూ...ఓ...హూ...

వెంక— ఏంయ్...

వన— ఏంయ్... ఏంయ్‌గీంయ్ అన్నావంటే మర్యాద దక్కదు తెలుసా.

వెంక— ఆరి తస్సాదియ్యా...మా చెడ్డకోపం వచ్చిందే! సరే గానీయండి, ఎక్కడి కిట్టా పోతుండావ్?

వన— రత్తమ్మత్తవుందా ?

వెంక— అంటే ?

వన— మీ అయ్యగారి పెళ్ళాం...

వెంక— అంటే ?

వన— నీ తలకాయ.

వెంక— అంటే ?

వన— అంటే...అంటే...అంటే... (అని లోపలికి వెళ్ళింది)

వెంక— మా పసందుగా వుందే పిల్ల:.. అచ్చంగా దీని అమ్మ లాగేవుంది. వుండదు మరీ !

వనజ తిరిగి వస్తుంది

వనజ— అత్త ఎక్కడికి వెళ్ళింది వెంకన్నా...

వెంక— ఇందాక దూసుకుపోతివే. ఇప్పుడు నే నెందుకు చెబుతాను. వెళ్ళి మీ అత్తనే కనుక్కో—

వనజ— చెప్పు వెంకన్నా...నువ్వు చాలా మంచివాడివిగా.

వెంక— నేనేం కాదులే... నువ్వే మంచిదానివి... మీ అమ్మ మంచిది. సరేనా !

వనజ— ఏడిశావ్... మా అమ్మకే వంక లెడుతున్నావ్... చెబుతావా చెప్పవా ?

వెంక— ఎందుకు ?

వనజ— ఏమైంది.

వెంక— యాడికో వెళ్ళింది...అదేంపనో నాతో చెప్పు. నే చెబుతాగా...

వనజ— ఏంలేదు...మరీ! మరీ!...

వెంక— ఆఁ సిగ్గెందుకు...నాతో సిగ్గెందుకు, చెప్పూ...

వనజ— పో...అన్నీ పాడుమాటలు.

వెంక— మరి లేకపోతే...

వనజ— ముకుందంగా రొస్తున్నారటగా?

వెంక— ముకుందంగారా? అబ్బాయిగోరు...నాకు తెలవదే?

వనజ— ఒరి దొంగవు. నీకు తెలవదేంటి? అయినా తెలిస్తే మాత్రం మా కెందుకు చెబుతారు.

వెంక— ఓయమ్మో...కోపం వచ్చిందే...కోపంలో బాగున్నావే.

వనజ—ఛీ! పో! పాడుచచ్చినోడా... (వెళ్ళిపోతూ) ఇదిగో అయ్యగారొస్తే...

వెంక— రమ్మని చెబుతాలే... ఏం? (నవ్వి పోతుంది)

వెంకడు తాడు పేనటం పూర్తిచేసి లాగిచూస్తూవుంటాడు

వెంక— ముండ చెడిపోయింది. అయితేనేంగాని, మహాపసందుగా వుంది. ఆ తల్లిబుద్ధులు రాకుండావుంటే బాగుపడుతుంది.

పాపయ్య, మాధవయ్య మాట్లాడుకుంటూ వస్తారు

మాధ—అరేయ్...వెంకడూ, ఆ మంచం ఇట్టా వెయ్యరా... లోపల కుర్చీకూడా పట్టుకురా...

వెంక— దానికి ఒకకాలు విరిగిపోయిందండీ!

మాధ— మంచిదే పట్టుకురారా...

వెంక— రెండోది అమ్మగారు అడకమీాద వేయించారండీ!

పాప— మీరు ఆలోచించేటప్పటికి పుణ్యకాలం కాస్తా గడిచి పోతుంది. ఇలాంటి వ్యవహారాలలో జాగు బొత్తిగా పనికి రాదు.

మాధ— ఏపని చేసినా ముందు వెనుకలు ఆలోచించడం మంచిది. తొందరపడి కాలుదూరిస్తే, ఆ తరువాత తీసుకోలేక అవస్థ పడాలి.

పాప— ఇంతకీ నా మీద నమ్మకం లేదంటారు ?

మాధ— నమ్మకం లేదని నేననడం లేదు. కొంచెం వ్యవధానంగా ఆలోచిద్దాం అంటున్నాను. వూళ్లోకూడా పెద్దతలకాయ లున్నాయిగా అందర్నీ సంప్రదించి చేద్దాం తొందరేం.

పాప— ఏమిటి చెప్పండి పెద్దరికం ? మనం పెద్దవాళ్లని గౌరవిస్తాం గానీ, మనకే ఎసరు పెడతారు వాళ్లు... ఈ రోజుల్లో ఎవరి మాటలూ నమ్మకూడదు. నమ్మామా మోస పోవడం తథ్యం.

మాధ— నాకు ధైర్యం కలగటం లేదు.

పాప— అదీ అసలు సంగతి. అప్పన్నేండి. కొత్తపని ఏది చెయ్యా లన్నా మనపల్లెటూరివాళ్లకు ధైర్యంవుండదు. అందులో మీకు అసలే వుండదు. ఏనాడన్నా ఇలాంటి వ్యవహారా లలో తిరిగారా చేశారా... మా కంటారా, రోజూ అదేకూడు అదేబట్ట... ఒక్కరోజు బస్తీకి పోందే నిద్రపట్టదు గదా... రాజకీయాలలో తలదూర్చిందే వుండు లేంగదా !

మాధ– అవును పాపయ్యా! ఎలా బ్రతికేవాళ్ళు అలా బ్రతికితే సరిపోతుంది. పోనీ అంత ధైర్యం వున్నవాడివి అనుభవమున్నవాడివి నువ్వే నిలబడరాదూ ?

పాప– నేనా! వొద్దు! పెద్దవాళ్ళు... వూరికి గౌరవస్తులు అయిన మీలాంటి వారికి అండగా వుండి పనిచేయటం నాకు సరదా నాకై నేను నిలబడలేను. అంత స్థోమతా లేదు. అయినా నన్ను లెక్క జేసేవాళ్ళెవరున్నారు చెప్పండి.

మాధ– అయితే నన్నేనా లెక్కచేసేది. కుఱ్ఱకారుకి నామీద మాత్రం నమ్మకం వుందా ? లేదు. ఇక పెద్దవాళ్ళలో నంటావా, నాయుడమ్మ ఎలాగూ వున్నాడు. వాడికి అనుయాయంగా వొస్తున్న పదవి. ఆ విషయాలు వాడికి బాగా తెలుసు. దానిలో వుండే మెళుకువలన్నీ తెలిసినవాడు. పైగా బలంగల పార్టీ అతనిది.

పాప– నాయుడమ్మ ఏదో చేస్తాడనే భయం మనకెందుకుండాలి? వూళ్ళో మీకున్న బలగంముందు వాడిదెంత! మీతో పోల్చుకుంటే వెధవ కానీవిలువ చేస్తాడా!

మాధ– కాస్త తగ్గించవయ్యా గొంతు గోడకు చెవులుంటాయి.

పాప– ఏడ్చారు. ఎవరు వింటే ఏంచేస్తారు. నాయుడమ్మ చేసే అన్యాయాలు ప్రతివాడి చెవుల్లోనూ గింగురుమంటున్నాయ్ ఈనాటికీ. నాలుగు మంచిమాటలు చెప్పి, ఉపన్యాసాలు చెప్పగానే పనైపోయిందీ? ఎవరి నెలా పట్టాలో అలా పట్టాలి. అది వాడిచేతకాకేం!

మాధ- పాపయ్యా! ముక్కూ మొఖం తెలియకుండా మాట్లాడు తావేం. ఇంకా చిన్నతనం పోలేదు! వుద్రేకపడితే కార్యాలవుతాయా! నెమ్మదిగా దాని లగూ బిగూలు ఆలోచించాలికానీ...

పాప- కాకపోతే ఏమిటండీ...రోడ్లు కంట్రాక్టులని వెయ్యి రూపాయలు, లైబ్రరీలని ఆనందలు... అవీ, ఇవీ అన్నీ వెనుక వేసుకుంటూన్నాడా! పైగా గప్పాలు కొడతాడు తనంతటివాడు లేనట్టు. వెధనది ఆ మాత్రం ప్రెసిడెంటుపని ఎవరు చెయ్య లేరనో. నా చేతికే చిక్కాడు కానీ...చిక్కితేనా...

* మాధ- సరే పాపయ్యా...ఎలాగో అబ్బాయి వస్తాడుగా సెల వలుకూడా వచ్చినయ్. వాడితోకూడా మాట్లాడి కుట్టి కారు వుద్దేశం ఎలాగుందో తెలుసుకుందాం.

పాప- కుట్టికారంతా మనచేతుల్లోవాళ్లండీ. మీకెందు కా సందేహం. మనం అన్నామంటే అడుగైనా కదలరు. ఆ విషయంలో మీకేం భయం అక్కర లేదు.

మాధ- పాపయ్యా!!

పాప- మీకెందుకు ఊ అనండి... నేనున్నాను వెనుక. ఎన్ని అవాంతరాలైనా దాటేస్తాను. పాపయ్య ప్రతాపం మీకు తెలియదు. పట్టణంలో మన విషయం అడిగితే తెలుస్తుంది. క్లబ్బులో నన్ను గురించి ఎలాచెప్పుకుంటారనీ!

మాధ- నువ్వు సమర్థుడవు కావనటం లేదు... కానీ అబ్బాయి రాగానే ఆలోచిద్దాం అని అంటున్నాగా...

పాప- డబ్బు ఖర్చు అవుతుందనే భయం మీకేం అవసరం లేదు. కానీ ఖర్చు కాకుండా వ్యవహారం నేను నడుపుతాను.

మాధ- సరే, రంగంలోకి దిగాక ఖర్చుకు వెరుస్తామా! కార్య సాఫల్యం చూసుకుంటాంగానీ...

పాప- అదే అంటున్నాను. అవసరమైతే నావి రెండెకరాలు అమ్మయినా సరే మనపని సాధిస్తాను తెలిసిందా?

మాధ- నాకోసం నువ్వు పొలం అమ్మటం ఎందుకులే!

పాప- ఆఁ సంగతి చెబుతాను. అయినా అవసరంవస్తే ఒకరు మాత్రం నెనుకాడతారా చెప్పండి. పాపయ్య విషయం మీకు మాటలలో చెప్పడం అనవసరం. క్రియల్లో చూస్తే మీకే తెలుస్తుంది. ఏమంటారు?

మాధ- అలాగే.

మాధవయ్యగారూ...మాధవయ్యగారూ...

మాధ- ఎవరూ?

పంతులు- నేనండీ!

మాధ- నువ్వటయ్యా పంతులూ! బయటనిలబడి కేకలెయ్యక పోతే లోపలికొచ్చేయకూడదూ!

పంతు- మాట్లాడుతున్నారని...

మాధ- ఏం మాటలులెండి, ఏదో పోచుకోలు కబుర్లు పొద్దుపోక.

పంతు- ఆఁ...ఇందాక ఇంటివద్దకు వచ్చారట?

మాధ– ఆఁ వూరికినే... పాపయ్య పట్టణం వెళ్ళివచ్చాడు...

పంతు– ఏం కొత్తసినిమాలు ఏమైనా వచ్చాయటా... ఏమండీ పాపయ్యగారూ, అంతేనా ?

పాప– పంతులుకు పాపయ్యంటే ఎగతాళి.

పంతు– నాకేం యెగతాళి పాపయ్యా! నా తిప్పలేదో నేను పడే వాణ్ణి, మీ పాదాలదగ్గర బతికేవాణ్ణి, మిమ్మల్నెగ తాళి చేస్తానా ?

మాధ– ఏదో నవ్వులాటకి అన్నమాటనే పట్టుకుంటావేం పంతులూ...ఐనవాడివిగనక పైగా బావమరది వరసో యేమో అన్నాడు ఎగతాళిగా.

పంతు– అవున్లెండి. మీరు అనకా వూరుకోరు, మేము పడకా తప్పదు. ఏంచేస్తాం మా కర్మ అలాకాలింది.

పాప– పంతులూ నాకు తెలీక అడుగుతాను నిన్ననేదేవ రయ్యా...ఎంతచెడ్డా ఊళ్ళోవాడివిగదా! చిన్న పెద్ద విషయాల్లో మాకు చేదోడు వాదోడుగా వుంటుంటావు గదా... నీవులేకపోతే మనవూరికి సగంకళ తప్పేది అం టాను నన్నడిగితే !

పం– ఈ కబుర్లకేంలే పాపయ్యా! పన్నెండుసార్లు మెట్రిక్ తప్పి బడిపంతులు పని చేసుకొనే నా ముఖానికి కళ కూడా నంటావ్.

పాప– అని ఎవరన్నారు చెప్పు. అంతఎత్తి పొడుపుగా మాట్లాడ తావు.

పంతు- కాకపోతే ఏమిటయ్యా! ఏదో కాస్త తెలిసినవాడివి, బస్తీ వ్యవహారాలు, రాజకీయాలు తెలిసినవాడివి అను కుని గౌరవిస్తే నా అంతటివాడు లేడుగదా అని విఱ్ఱ వీగటం, నాలాంటి వాడ్ని గడ్డిపోచకంటె కనాకష్టంగా చూడడం ఏంభావ్యంగా వుంది.

పాప- ఇదొకటి లేనిపోని నేరం.

బంతు- లేకపోతే నీ ప్రచారం దేనికి? పంతులు ఏమైతే నీకెందుకు ...డబ్బా కొట్టుకు వాయించకపోతే ఏం? ఎవడేడ్చాడు నిన్ను ప్రచారం చేయమని.

మాధ- అదేమిటి పాపయ్యా!

పంతు- అంతమాత్రాన నీకు పెరిగిన గౌరవమూ లేదు నాకు వచ్చిన నామోషీ లేదు.

పాప- పంతులూ! అందరూ పాపయ్య మంచివాడు కాదూ అన్నారు, నువ్వూ అన్నావు ఏముంది తేడా. చదువు కొన్న వాడికి చదువుకోని వాడికి భేదంలేదు. అందరూ ఎంత గుడ్డిగా చెప్పుడుమాటలు వింటారో, నువ్వూ అలాగే విన్నావు. నిజం ఎంతవరకని యోచించావా? లేదు- గుడ్డిగా నమ్మేశావ్...

మాధ- సరే మీమీా మనస్పర్థలుంటే ఆనక చూచుకోవచ్చు గానీ, అసలు సంగతికి రండయ్యా.

పాప- చెప్పండి నేనంటే అసలే మండి పడుతున్నాడు పంతులు.

మాధ- పంతులూ... కూర్చో అలా నిలబడే వున్నావేం?

పంతు- కూర్చుంటాను లెండి కూర్చోటాని కేం.

మాధ- అలా అన్నావు బావుంది. ఆ . . .

వెంకడు టెలిగ్రాం కాగితంతో ప్రవేశిస్తాడు.

వెంకడికి వస్తుథా పంతులుమీద గురి నమ్మకం గౌరవంవుంది.

వెంక- పంతులుగారూ. . .

మాధ- ఏమిట్రా హడావుడి.

వెంక- పంతులుగారూ, మీకు ఏమిటో వచ్చిందండి.

పాప- ఏమొచ్చింది ?

వెంక- అదేదోనండి. . . . అంట. . .వచ్చింది.

పంతు- ఏమిటి ?

వెంక- ఏదో టె. . . టె. . . తస్సాదియ్యా నోరు తిరగదండి. ఇదిగోనండి (టెలిగ్రాం యిస్తాడు) మీ యింటికాడ్నించి వస్తుంటే అమ్మాయిగో రిచ్చారండి మీ కియ్యమని. అదేమిటి అంటే అదేదో అని అన్నదండి . . . రావడం లేదు . . .

పంతు- టెలిగ్రాంకొచ్చిన తిప్పలా అది . . .

మాధ- ఎక్కణ్నుండి టెలిగ్రామ్?

పాప- పంతులుపని నే చెప్ప లేదటండీ, అంతా టెలిగ్రాముల మీదనే నడవడం.

పంతులు పాపయ్యవైపు చురచురా చూస్తాడు.

పంతు- ముకుందరావు వొస్తున్నాట్ట.

పాప– మన ముకుందరావే !

పంతు– అవును మాధవయ్యగారి ముకుందరావు.

పాప– (అదోలా ముఖంపెడతాడు)

మాధ– ఎప్పుడొస్తాట్ట ?

పంతు– ఈ బండికే వస్తున్నాట్ట.

మాధ– బండివచ్చే టైమైందేమో . . .

పాప– (గడియారం చూస్తూ) అయింది.

మాధ– అరే వెంకడూ, స్టేషనుకు వెళ్లు అబ్బాయి వస్తున్నాట్ట– సామానుపట్టుకురావల్సి వుంటుంది.

వెంక– మరేనండి.

పాప– తొరగా పోవోయ్.

వెంక– (పోతా లేవోయ్, అన్నట్టు చూచి వెళ్లిపోతాడు)

మాధ– ఇంకేంరాశాడు పంతులూ, అబ్బాయి . . .

పంతు– అంతేనండి, ఇంకేం లేదు . . .

పాప– ఏమో ఏం వ్రాశాడో మనకేమైనా తెలుస్తుందా ! చస్తుందా ! !

పంతు– చదువుకోవయ్యా కావలిస్తే (టెలిగ్రాం మొఖాన కొడతాడు)

పాప– నాకా ఎంగిలి పీచురాదనేగా . . . వొస్తే అలా మొఖాన కొట్టేవాడివా ! (కళ్లల్లో ద్వేషం తొణికిసలాడుతుంది)

మాధ- పంతులూ ! నువ్వూ పాపయ్యకు తోడు బోయినావే ! అతను అసలే నిప్పుతొక్కినకోతి వాడికి తోడు బోయావు నువ్వు . . . బాగుంది మీవరస.

పంతు- మీకు తెలియదండి మాధవయ్య గారూ. . . వూళ్లో విషయాలు మీకు పట్టవు. మీ పొలాలు మీ పనులు మీవి గానీ, లోకం ఎలానడుస్తుందో మీకేం తెలుసు. మిన్ను విరిగి మీదపడ్డా చలించరు మీరు.

మాధ- సరే ఈ పొగడ్తలకేం గానీ . . .

పాప- పొగడ్తలు కాదు. నిజం సెలవిచ్చారు పంతులుగారు.

పంతు- (పాపయ్య వేపు కోపంగా చూస్తాడు)

మాధ- నువ్వూరుకో పాపయ్యా . . .

పాప- ఎవరెట్లాపోతే నా కెందుకు లెండి. లేనిపోని పీడ.

పంతు- పీడ గనకనే వేలెట్టడం . . . బుద్ధిలేకపోతే సరి. పదిమంది లో తిరగడం నేర్చినప్పుడన్నా నేర్చుకోవాలి. ఒకర్ని చూచన్నా నేర్చుకోవాలి. అదికూడా లేదు మన బ్రతుక్కి-

మాధ- వూళ్లో వ్యవహారాలు ఎలావున్నాయంటావు పంతులూ ?

పంతు- నాకు ఎవరి వ్యవహారాలూ పట్టవుబాబూ . . .

మాధ- అదికాదయ్యా . . .

పంతు- అదీ కాదూ, ఇదీ కాదూ. ఎందుకు చెప్పండి మాధవయ్య గారూ . . . నా మానాన నన్ను బ్రతకనీయండి. . . . మాట వరసకు ఏదైన ఒకటిజారినా ఈ పాపయ్య

సర్దారు టాం టాం వేస్తాడు. కాలికి బలపం కట్టుకొని,
యింటియింటికి తిరిగి మరీ ప్రచారం చేస్తాడు.

మాధ– ఈ వ్యవహారంలో అలాంటిదేది ఏమీ చెయ్యడని నే
అనుకుంటున్నాను. సరేనా!

పంతు– మిమ్మల్ని చూచి ఫ్రాడుకోవలసి వస్తుంది.

మాధ– సరేగాని నాయుడమ్మ ఏమంటున్నాడు?

పంతు– ఏమిటి అనేది. ఏముంది అనటానికి.

మాధ– నిన్న మళ్లా బస్తీకి వెళ్ళాడటగా!

పంతు– అవును వెళ్ళివచ్చి వున్నాడు... ఏం అలా అడుగు
తున్నారు...

మాధ– ఆ... ఏం లేదు... ఎలక్షన్స దగ్గర కొస్తున్నాయిగా.
ఎలా వున్నాయో వారికే వినాలని.

పంతు– మన వారికి ఎలక్షన్స వస్తేనేం, మరేం వస్తేనేం.

మాధ– సరే లేవయ్యా వేదాంతం కాస్త కోపం తగ్గించి శాంతంగా
మాట్లాడు. విషయాలు లోతుగా ఆలోచించాలి, నాది
కాదుగదా అని దులుపుకుంటే...

పంతు– ఎప్పుడూ లేని విషయాలు యిప్పుడు మీకు కావలసి
వచ్చాయేమిటా అని ఆలోచిస్తున్నాను.

మాధ– ఆఁ...

పంతు– ఏమో మరి. తూర్పు వేపు నాయుడమ్మ దెబ్బకు తిరుగు
లేదని అనుకుంటున్నారు. వాళ్ళ బలగం అదంతా.....
అయినా నాయుడమ్మది మహా గుండె నిబ్బరం...

మాధ– ఏమిటీ ?

పాప– ఇంకేమిటి... ఊరును ఏకచ్ఛత్రాధిపాలన చేస్తున్నా గదా అని విఱ్ఱవీగుడు, వూళ్లో సరైన మగాడే లేనట్లు వాడికే యిస్తారేమిటి పెత్తనం. ఆ మాత్రం వూరు నుద్ధరించే వాళ్ళే లేకపోయారా !

మాధ– అందుకేగదా మనం వూనుకుంటున్నాం.

సంతు– మీ తాలూకు ఎవరన్నా వున్నారా ఏమిటి ?

మాధ– వున్నారనేగా !

సంతు– మన అబ్బాయిగార్ని నిలబెట్టండి...చదువు కున్నవాడు. మన వూళ్లో అంతకన్నా చదువుకున్నవాళ్లు లేరాయె.

పాప– అబ్బాయి విషయం అటుంచండి ?...

సంతు– తమరే నిలబడతారా ?...

మాధ– నేనే వుందామని... అంతా బలవంతం చేస్తున్నారు. అందుకని ...

సంతు– అలాగే కానియ్యండి అభ్యంతరం ఏముంది. మీరు నిల బడితే కాదనే వారెవరు !

పాప– మీ కెందుకండి మాధవయ్యగారూ... మీకు కుడి చేయిగా నేనుండగా మీ కేంలోటు. అన్ని వ్యవహారాలు నేను చూచుకుంటానంటినిగా మీరు భయపడటం దేనికి ?

సంతు– పాపయ్య బలం చూచుకునా యిదంతా...అయితే కడ తేరి నట్లే.

మాధ- అదేమిటి పంతులూ !

పంతు- కాకపోతే పాపయ్య సపోర్టా...! మీరు నెగ్గటం ? దేనిలో పెట్టినా కుమ్ము దుమ్ముగా వుంటుంది.

పాప- మనం పట్టింది బంగారం పంతులూ ఏమో అనుకుంటున్నావుగా మోలు .

పంతు- బంగారంకాదు మట్టి.

మాధ- పంతులూ ఒకమాట చెబుతానువిను. పాపయ్య దేమిటి చెప్పకుర్రాడు. వూళ్లో వ్యవహారాలు అతనికేం తెలియవు. మనం మనం చూసుకోవాలి.

పాప- మాధవయ్యగారూ ! పాపయ్యంటే మీ కంటికెలా కనబడతాడు.

పంతు- మాధయ్యగారూ నే చెబుతున్నాను. మనకేమైనా మేలు కలగాలంటే, వూళ్లో సాటివారిని నమ్ముకోవడం మంచిది...ఈ పాపయ్యను నమ్ముకుంటే తిన్నట్టే.

పాప- పంతులూ !...

పంతు- ఊఁ హుఁ...వుడత వూపులకు......

మాధ- ఈ విషయం జ్ఞాపకముంచుకో పంతులూ. వూళ్లో విచారిస్తూ వుండు. మనకు ప్రతికూలంగా వుందో అనుకూలంగావుందో పరిస్థితి ఒకకంట కనిపెట్టివుండాలి,

పంతు- ఒకమాట చెబుతా వినండి... నా సహాయం మీకు ఎప్పుడూ వుంటుంది. కానీ...ఒక్క విషయం. పాపయ్య మీతోవుంటే మీకు ఒక్క ఓటుకూడా రాదు. నా

విషయం అంటారా ఛస్తే నే సహాయం చేయను చేయలేను.

మాధ- నామీద నమ్మకనే లేదంటావు...

పంతు- లేక కాదు బాబూ నే ననేది. నా ఆశయాలు వేరు. ఈ పాపయ్య ఆశయాలు వేరు. మా ఇద్దరికీ పొత్తుకుదరదు. ఎందుకు నన్ను అనవసరంగా దించుతారు ఈ విషయా ల్లోకి. క్షమించండి నన్ను...

మాధ- అంతేనా పంతులూ...

పంతు- ముమ్మాటికీ నేను మీకు సాయంచేయలేను. నా ఆశ యాల్ని నేను చంపుకోలేను. ఏదో ఇట్లా బ్రతుకుతు న్నాను. అలాగే బ్రతకనీయండి మీకు పుణ్యాంవుంటుంది. (వెళ్లిపోతాడు)

మాధ- పంతులూ! పంతులూ! (అని పెద్దగా పిలుస్తాడు. విని పించుకోకుండా వెళ్లిపోతాడు పంతులు) ఏమిటయ్యా పంతులు అలా అంటాడు.

పాప- ఆ జాతే అలాంటిది. తిన్నయింటి వాసాలు లెక్కబెట్టే రకం. విశ్వాసం వుంటేగా!

మాధ- సరేలే...విశ్వాసం. అతనిమీద ఏవేవో సాకులుజెప్పి, అవాకులు చెవాకులు కల్పించి వెర్రెత్తేట్లు చేసివుంటావు. లేకపోతే ఎందుకంటాడు నిన్ను. అతను అన్ని మాట లన్నా నోరెత్త లేకపోయాన్.

పాప- గిట్టనివాళ్ల నేకం అంటారు. అవన్నీ పట్టించుకుంటే మన కార్యం సాధించుకోవడం సాధ్యం అవుతుందా!

మాధ– కార్యం సాధించుకోవడం... ఇదేనా కార్యం సాధించుకోడానికి లక్షణం.

పాప– కాకపోతే, అతనన్న ప్రతిమాటకూ నేను కోపగించుకుంటే ఒక యుద్ధం జరిగి వుండేది ఈ సరికి.

గోపాలరావు వస్తాడు. పొడుగ్గా వుంటాడు. లాల్చీ చేతికర్ర అతని ప్రత్యేకతను తెలుపుతుంటాయి.

మాధ– రండి గోపాలంగారూ!

గోపా– రమ్మని కబురుపంపారట. సమయానికి నే నింట్లో లేను. రాగానే చెప్పారు. ఆఘమేఘాలంగా రెక్కలుకట్టుకు వాలాను. ఏమిటి నాకోసం ఇంత కంగారుగా పిలిపించారు!

మాధ– ఆఁ... పెద్ద పనేముందీ... ఏం లేదు... వూరికే రమ్మన్నాను ఏమీ తోచుబడి కాక...

గోపా– పోనీయండి, వూళ్లో పుకారుగావుందిగా......ఆవిషయం గురించి మాట్లాడటానికని అనుకొన్నాను...

మాధ– పుకారా!? నా మీదనే!?

గోపా– అవును...

మాధ– నేను ఎవరికి ఏమీ అపకారం చేయలేదే... నా మీద పుకారేమిటి గోపాలరావ్...!

గోపా– ఆఁ ఏముందీ... వడ్లగింజలో బియ్యపుగింజ... అయినా నేనుమాత్రం నమ్మాననూ...అదిపుకారని నేననుకున్నాను. ఇదిగో తోకంటే అదుగో పులిఅంటుంది లోకం.

మాధ– ఇంతకీ ఏ విషయం గురించి.

గోపా- ఆఁ మరేమీ లేదు, నాయుడమ్మకు వ్యతిరేకంగా మీరు నిలబడుతున్నారని.

మాధ- నేనా...ఛాఛా...ఎవరు పుట్టిస్తారయ్యా ఇలాంటివి.

గోపా- ఎవరో కాని వాళ్లు కలగజేసికొని చెప్పి వుంటారు... అవునా పాపయ్యా!

పాప- అంతే అయివుంటుంది.

గోపా- అదిగో పాపయ్య కూడా ఒప్పుకున్నాడు. ఎవరో పాపయ్య లాంటి పెద్దమనిషి చాటుగా ఎవరి చెవిలోనో వూదితే అది ఆ నోటా ఆ నోటా పడి రచ్చకెక్కి వుంటుంది. బజార్న పడకుండానేవుండాలి. పడ్డదే చూడండి. బజార్న పడ్డ రహస్యం యేం దాగుతుంది!

మాధ- మంచి మాటన్నావు... చెబితే చెప్పుకున్నారు. ఆ నోట ఆ నోట వింటుంటే నాకూ అనిపిస్తుంది నిజంగా పోటీ చేద్దామా అని

గోపా- చెయ్యదలచుకుంటే చేసేది. దానికి పెద్దఆలోచనలెందుకు.

మాధ- ఇంతవరకు నాకూ ఆ యాలోచనలేదు. రాజకీయాలంటేనే నాకు మహాతలనొప్పి...ఏదో మీలాంటి పెద్దలు అనడంవల్ల, ఊరు కోడై కూయడంవల్ల, నిజంగా అందుకు నేను సమర్థుడనేమోనని అనుమానం కలుగుతోంది...

గోపా- దీనికి సమర్థత, అసమర్థత ఏమిటి? ఎవరు నాలుగురాళ్లు ఖర్చుచేయగలిగితే వాళ్లది రాజ్యం.

మాధ- అదిసరేగాని గోపాలరావ్...మనం నిలబడతామేచూడు, లోకం ఏమనుకుంటుంది. ఈ ముసలితనంలో మాధవ

య్యేకు పదవిమీద వ్యామోహం కలిగింది అని అనుకుం టారా! నలుగురూ అయినవాళ్లూ కానివాళ్లుకూడా దుయ్యబడతారే అని ఆలోచిస్తున్నాను.

గోపా– లోకంయిచ్చే మంగళహారతులు అందుకోగలగాలి!

మాధ– ఎందుకొచ్చిన తిప్పలు... అయినా నాలాంటివాడు రంగంలోకి వస్తే ఒకందాన రాదే! తగూలూ, కొట్లా టలు జరుగుతాయేమోనని భయం...

గోపా– పెద్దవాళ్లు మీరే భయపడితే!

మాధ– ఆ...ఏం పెద్దరికం...మన పెద్దరికాలను గౌరవించే వా ళ్లెవరు చెప్పు. ఎవరి స్వార్థం వారిదయిపోయింది. ఎవరికి వాళ్లు రెండుచేతులా వెనకవేసుకుందామని చూచేవారే గాని నలుగురికీ మంచిచేద్దాం, పదిమందిలో మంచి అని పించుకుందాం అని అనుకునేవాళ్ళు కరువాయె...

గోపా– మంచిచెడ్డ అనే విచారణ పూర్వకాలానికి వదిలేద్దాం... మనం ప్రస్తుతం చూచుకోవలసింది ఒకటి. నయానో భయానో ప్రజల్ని మభ్యపెట్టి గెలవటం. అవసరమైతే దండప్రయోగంకూడా చేయాలి. ఖూనీలు జరిగినా వెనుకాడగూడదు. సరేనా...అంత మొండిధైర్యంతో రంగంలోకి రాగలిగితే రావడం, లేకపోతే చేతులు ముడుచుకొని కూచోడం.

మాధ– చూస్తూ చూస్తూ అంత దారుణానికి ఎలా దిగాలోయ్ గోపాలరావ్...

గోపా- దిగాలి బాబూ దిగాలి...వీలైతే ఇంకేమైనా చేయాలి. ఎంత దారుణానికైనా దిగాలి. లేకుంటే గెలవటంకష్టం... రోజూ చూస్తుంలా... రాజకీయ జీవితంఅంటేనే నెత్తురు కూడు. మీకు తెలియదేమో! దానిలోకి దిగటం చేజేతులా పాపానికి నడిగట్టుకోడమే అంటాను నన్నడిగితే. నేం చేతులుచచ్చి వూరుకోలా, ఈ దారుణం చేయలేక చేతులు ముడుచుకు కూచున్నాం.

మాధ- అయితే ఏమిటి కర్తవ్యం.

గోపా- నన్నడిగితే ఈలాంటి విషయాల్లో తలదూర్చటమే అనవసరం అంటాను.

మాధ- అది మినహాగా... ఇప్పటికి దూరాచ్చామే అనుకో...

గోపా- అని ఎందుకనుకోవాలి... మీరు మానుకుంటే కాదనే వారెవరు?

మాధ- ఎలా వచ్చిందో వచ్చింది...ఫలానా మాధవయ్య నిలబడతాడు అనే పుకారు రానే వచ్చించిది గదా...... అంతా నిజమేనను కొంటున్నారు గదా...

గోపా- ఏమండీ అనుకుంటే ఏమిటి నష్టం.

మాధ- తీరా ఇప్పుడు మానుకుంటే ఏమంటారు......ఈ శుంఠలకు జడిసే మానుకున్నారంటారు మన పరువంతా నేల మట్టం కావలసిందేగా.

గోపా- పరువు కోసం ప్రాణాన్ని, ఎక్కడ వెచ్చిస్తాం చెప్పండి.

మాధ– వచ్చినపేరు ఎలానో వచ్చింది... గెలవటం గెలవక పోవటం వేరు. అందరూ అనుకొంటున్నారు గనుక వాళ్లందరి కోసం మాధవయ్య నిలబడక తప్పదు.

గోపా– తప్పదంటూరు!

మాధ– అనేగా... నే నిలచి గెలవక పోయినా, నిలబడ్డం నిజం.

గోపా– గెలవకపోవడం ఏమిటి! ఆ అపసవ్యకం ఎందుకు. చేసే ప్రయత్నం గట్టిగానే చేయండి బరువు భారాలు ఆ భగవంతుడి మీదే వేసి.

మాధ– అందుకు మీ అందరి సహకార సంపత్తులూ కావాలి. ఆ గోల నాకసలే తెలీదు... బొత్తిగా కొత్తవాణ్ని రాజకీయాలకు. ధైర్యమైతే వుందిగాని ఎలా నడవాలో తెలీదుగా.....

గోపా– దానికేం లెండి.

మాధ– అలా అంటే గాదు... మీరందరూ నడుం కట్టుకొని కార్యరంగంలోకి రావాలి. మీలో ప్రతి ఒక్కరూ మాధవయ్యకే పని చేయాలి. ఇన్నిమాటలెందుకు స్వవిషయం అనుకోండి... కృషి చేయండి.... డబ్బు ఎంత ఖర్చు అయినా ఫరవాలేదు. మీరన్నట్లు గెలుపు మనది కావాలి...

గోపా– పంతులుతో కూడా చెప్పి చూడక పోయారూ... ఏమనే వాడో.

మాధ– చెప్పటమైంది, చూడటమైంది.

గోపా– ఏమన్నాడు ?

మాధ– ఏమన్నాడు, నసేమి నావల్లగాదు నన్ను వొదలండి రక్షించండి అన్నాడు.

గోపా– అదీ ఒకఎత్తు.

మాధ– ఎత్తేమిటి.

గోపా– కాక...పంతులు మీా పక్షం వుంటాడని నేననుకోను.

మాధ– పాపయ్య తనకేదో అన్యాయం చేస్తాడని, అతను మన పక్షం వుండడంవల్ల తను రాలేకపోతున్నాననీ అన్నాడు.

గోపా– అదంతా మోసం...పంతులు ఈ మధ్య కాస్త కమ్యూనిష్టు అయినాడులే. పార్టీ ఆదేశం లేందే మనతో సహకరించడు.

మాధ– పంతులేమిటి కమ్యూనిష్టు కావటం ఏంటి. నా చెవుల్నే నమ్మలేకున్నానే.

గోపా– మీారు ఏదీ నమ్మలేరు. తెల్లని వన్నీ పాలు, నల్లని వన్నీ నీళ్లు అనుకుంటారు. నవ్వుతూ మాట్లాడినంతమాత్రాన పంతులు మనవాడే గదాని అనుకున్నారు. అతను మహా నేర్పుగా తప్పుకుంటాడు లెండి. చదువుకున్న తెలివి తేటలు అవి...నాకు తెలీదూ!

పాప— నే నెప్పుడో అనుమానించాను...పంతులు వాలకం అదీ చూచి కాని బయట పెట్టలేదు.

మాధ– (హేళనగా) ఉద్ధరించావ్ !

పాప– బస్తీకెళ్ళినపుడల్లా, పార్టీ ఆఫీసుకు వెడతాడని విన్నాను కాని కళ్ళారా ఎప్పుడూ చూడ లేదు ... అందుకనే ధృడంగా తేల్చుకోకుండా ఎందుకులే అనడం అని వూరుకున్నా.

గోపా– సరే వస్తానండీ మాధవయ్యగారూ... వస్తా పాపయ్యా.

మాధ– మర్చిపోకండీ మన విషయం ...

గోపా– ఓ... అలాగే. (వెళ్ళిపోతాడు)

మాధ– పంతులు కమ్యూనిష్టని ఎప్పుడూ మాటమాత్రం చెప్పావు కాదేం పాపయ్యా?

పాప– ఆఁ... ఎందుకు ఏడ్చిపోతాడని.

మాధ– నీ తెలివి తేటలు ఏడ్చినట్టే వున్నయ్. వాడేడ్చిపోతాడనా – నీ బ్రతుకు బజారెక్కుతాడనా!

పాప– ఇప్పటికే పంతులు కుర్రాళ్లను చాలామందిని తన చేతి కిందకి తీసుకున్నాట్ట. ఈ కుర్రాళ్లకైనా బుద్ధిలేదు. పంతులు మాటలువిని చెడిపోతున్నారు. నాయుడమ్మ కూడా ఏవో పంతులుతో మంతనాలు జరుపుతున్నాడని వినికిడి ...

మాధ– నిజంగానా!!!

పాప– అని వినికిడి ఎంతవరకు నిజమో మాత్రం తెలీదు... ఆఁ గోరంతంటే గంపంత అంటారు చెప్పుకునేవాళ్ళు... వాళ్ళ మాటలు నమ్మేదేమిటి!

మాధ- వాళ్ల మాటలు గాక నీ మాటలు నమ్మమంటావ్.

పాప- అందుకే పంతులికి నేనంటే అంత కడుపుమంట ... ఇందాక టెలిగ్రాం వచ్చినపుడు ఎలాచూచాడో చూచారుగా ...

మాధ- మా ముకుందం, పంతులికి టెలిగ్రామ్ ఇవ్వటం ఏమిటి ? !

పాప- చెప్పానుగా, కుర్రాళ్ళంతా పంతులు వలలో పడ్డారని.

మాధ- మనవాడు కూడానా !... వాడు అలాంటివాడు కాదే !

పాప- కాదని మీరనుకుంటారు... లేకపోతే పంతులకే ఎందుకు రాయాలి. మీకు రాయకూడదా... కన్నతండ్రి కన్నా పంతులు ఎక్కువా ఏం నిజం మాట్లాడితే ఎవరికైనా నిష్టూరంగానీ !

మాధ- నిజమే, వీడు నాకు రాయకుండా పంతులు కెందుకు రాయాలి. మేమంతా చచ్చామను కున్నాడా... రానీ చెబుతాను ...

పాప- పోనీయండి వచ్చాక అన్ని విషయాలు తెలుస్తాయిగా. తొందర పడడం దేనికి వ్రాళ్లో విషయాలు ఇలా వున్నాయని చెప్పకుండా ఒకదారికి తీసుకురండి ...

మాధ- సరే పద... ఆ వెంకటరెడ్డిగారి కోటిరెడ్డితో కూడా మాట్లాడాలి (ఇద్దరు వెళ్ళి పోతారు)

కొంచెంసేపు స్టేజి నిర్జనంగా వుంటుంది.

మల్లెపూల వెన్నెలలో
తెప్పమీద తేలిపొయే

చల్లనైన జాబిలినీ
నన్ను కలచి పోకోయీ
నన్ను మరచి పోకోయీ
నన్ను విడచి పోకోయీ ...

వనజ పాట చివరిభాగం పాడుతూ వస్తుంది...... ఎవ్వరూ వుండరు......అటూ యిటూ చూస్తుంది. ఎవరూ లేకపోవడం వల్ల పాట తీర్గా పాడుతుంది...ముకుందరావ్ వనజ కళ్ళుమూసి

ముకుం— నన్ను కలచి పోకోయీ...నన్ను మరచి పోకోయీ..
నన్ను విడచి పోకోయీ ....

వనజ— అబ్బ... (అని విదలించు కుంటుంది)

ముకుం— నన్ను విడిచి పోకోయీ ...

వనజ— ఎప్పుడో దిగారే దొరగారు సీమనించి ...

ముకుం— ఆ అదృష్టం పట్టలేదు... సీమకు వెళ్లే భాగ్యం నీ వల్ల కలగాలి .

వనజ— ఎవరనుకున్నావ్ నన్ను... మీ మామయ్యకూతురు సుశీలనుకాను.

ముకుం— చెప్పకోకపోతే తెలీదనుకున్నావా.

వనజ— ఒక వేళ అలా అనుకున్నావేమో !

ముకుం— అనుకోలేదులే...

ఇంతలో వెంకడు సామాను మోసుకొస్తాడు.

పెట్టె బెడ్డింగు లోపలపెట్టు వెంకన్నా ...

మాధ- వాళ్ల మాటలు గాక నీ మాటలు నమ్మమంటావ్ .

పాప- అందుకే పంతులికి నేనంటే అంత కడుపుమంట ... ఇందాక టెలిగ్రాం వచ్చినపుడు ఎలాచూచాడో చూచారుగా ...

మాధ- మా ముకుందం, పంతులికి టెలిగ్రామ్ ఇవ్వటం ఏమిటి ? !

పాప- చెప్పానుగా, కుర్రాళ్ళంతా పంతులు వలలో పడ్డారని .

మాధ- మనవాడు కూడానా !... వాడు అలాంటివాడు కాదే !

పాప- కాదని మీరనుకుంటారు... లేకపోతే పంతులకే ఎందుకు రాయాలి . మీకు రాయకూడదా... కన్నతండ్రి కన్నా పంతులు ఎక్కువా ఏం నిజం మాట్లాడితే ఎవరికైనా నిష్ఠూరంగానీ !

మాధ- నిజమే, వీడు నాకు రాయకుండా పంతులు కెందుకు రాయాలి . మేమంతా చచ్చామను కున్నాడా... రానీ చెబుతాను ...

పాప- పోనీయండి వచ్చాక అన్ని విషయాలు తెలుస్తాయిగా . తొందర పడడం దేనికి వూళ్ళో విషయాలు ఇలా వున్నాయని చెప్పకుండా ఒకదారికి తీసుకురండి ...

మాధ- సరే పద... ఆ వెంకటరెడ్డిగారి కోటిరెడ్డితో కూడా మాట్లాడాలి (ఇద్దరు వెళ్ళి పోతారు)

కొంచెంసేపు స్టేజి నిర్జనంగా వుంటుంది .

మల్లెపూల వెన్నెలలో
తెప్పమీద తేలిపోయే

చల్లనైన జాబిలినీ
నన్ను కలచి పోకోయీ
నన్ను మరచి పోకోయీ
నన్ను విడచి పోకోయీ . . .

వనజ పాట చివరిభాగం పాడుతూ వస్తుంది...... ఎవ్వరూ వుండరు......అటూ యిటూ చూస్తుంది. ఎవరూ లేకపోవడం వల్ల పాట తీరిగ్గా పాడుతుంది...ముకుందరావ్ వనజ కళ్ళుమూసి

ముకుం— నన్ను కలచి పోకోయీ...నన్ను మరచి పోకోయీ..
నన్ను విడచి పోకోయీ . . . .

వనజ— అబ్బ. . . (అని విదలించు కుంటుంది)

ముకుం— నన్ను విడిచి పోకోయీ . . .

వనజ— ఎప్పుడో దిగారే దొరగారు సీమనించి . . .

ముకుం— ఆ అదృష్టం పట్టలేదు. . . సీమకు వెళ్లే భాగ్యం నీ వల్ల కలగాలి .

వనజ— ఎవరనుకున్నావ్ నన్ను. . . మీ మామయ్యకూతురు సుశీలనుకాను.

ముకుం— చెప్పకోకపోతే తెలీదనుకున్నావా.

వనజ— ఒకవేళ అలా అనుకున్నావేమో !

ముకుం— అనుకోలేదులే. . .

ఇంతలో వెంకడు సామాను మోసుకొస్తాడు.

పెట్టె బెడ్డింగు లోపలపెట్టు వెంకన్నా . . .

వెంక— తస్సాదియ్యా... అప్పుడే వచ్చిందే...ఎట్టా వాసన పట్టావే తల్లీ...

వనజ— (ముద్దుగా) అబ్బా చూడండీ !

ముకుం— వూరుకో వెంకన్నా, ఇది ఆమె సొంతవిషయం...అవునా?

వనజ— అవ్వన్లే పాపం, అబ్బాయి చెప్పొచ్చాడు. సొంతవిష యంట...సొంతవిషయం...ఫో...నాతో మాట్లాడకు.

ముకుం— అలాగే— మాట్లాడను.

వనజ— పాపమనీ... ఒక్కసారన్నా వుత్తరంరాయ లేదుగానీ.. ఇంటికిరాగానే వనజ కావల్సివచ్చిందీ...

ముకుం— ఎవరికి నాకా, నీకా... అందుకే ఎప్పుడొస్తాడా ఎప్పుడొస్తాడా అని కళ్ళు కాయలు కాచేలా కాచు కూర్చుని రాగానే స్వాగతమిచ్చాను...

వనజ— అబ్బ వెక్కిరిస్తున్నాడు చూడు చక్కనయ్య.

వెంక— మా చినబాబుగారి చక్కదనానికే వంక లెడతావ్... నీలాగ గిడసబారిన కోతిలా లేడనా... పోపోవమ్మా మా బాబుగారి నన్నావంటేనా...

వనజ— ఏంచేస్తావేం ?

వెంక— ఏంచేస్తానా ? ఏంచేయమంటారు అబ్బాయిగారూ ?

ముకుం— ఆవిడనే అడుగు.

వెంక— అదీ...తస్సాదియా...ఏం సిగ్గూ...ఏంవయ్యారం...

వనజ— ఇట్టయితే నే వుండను. నే వెళిపోతా...(వెళ్తూవుంటుంది)

ముకుం— మల్లెపూల వెన్నెలలో... (పాటగా)

వనజ— (తిరిగివచ్చి) ఆ పాట నాది. ఎవరూ దాన్ని పాడగూడదు . . . పాడితే అరెస్టు చేస్తాం.

ముకుం— కౌగిట్లోనా ! ? . . . (నాలిక కొరుక్కుంటాడు)

వనజ— (సాయంత్రం ఫలానాచోటుకి రమ్మన్నట్టుగా సంజ్ఞలు చేసి వెళ్ళిపోయింది)

ముకుం— ఓ. . .యస్. . .ఆలాగే. . .
వెంకన్నా సామాను లోపలపెట్టావా ?

వెంక— పెట్టానుగాని బాబుగారూ ఈ పాడుముండతో మీ కేంటి సేఁయితం !

ముకుం— అవేంమాటలు వెంకన్నా !

వెంక— వున్నమాటన్నాను అబ్బాయిగారూ !

ముకుం—ఏమిటి నీ ముఖం. వున్నమాట. . . లేనిమాట . . .

వెంక— దీనమ్మ మంచిదికాదంటారుగాండి . . . వోడితోనో లేచి వచ్చిందంటగా. . .

ముకుం— అయితే !

వెంక— ఈ వనజమ్మ వోరికి పుట్టిందికూడా తెల్దండీ ! ఆ పంతులు దీని తల్లి లేదటండీ దుర్గమ్మ, దాన్ని వుంచుకున్నాడని కూడా అనుకొంటున్నారు .

ముకుం— ఏడ్చినట్లే వున్నాయ్ నీ కబుర్లు . తల్లి చెడ్డదైతే పిల్లలు కూడా చెడిపోవాలని ఎక్కడుందిరా . . . అలాంటిదేమన్నా వుందా చెప్పు .

వెంక– తస్సాదియ్యా... అప్పుడే వచ్చిందే...ఎట్టా వాసన పట్టావే తల్లీ...

వనజ– (ముద్దుగా) అబ్బా చూడండీ !

ముకుం– వూరుకో వెంకన్నా, ఇది ఆమె సొంతవిషయం...అవునా?

వనజ– అవున్లే పాపం, అబ్బాయి చెప్పొచ్చాడు. సొంతవిష యంట...సొంతవిషయం...ఫో...నాతో మాట్లాడకు.

ముకుం– అలాగే– మాట్లాడను.

వనజ– పాపమనీ... ఒక్కసారన్నా వుత్తరంరాయ లేదుగానీ.. ఇంటికిరాగానే వనజ కావల్సివచ్చిందీ...

ముకుం– ఎవరికి నాకా, నీకా... అందుకే ఎప్పుడొస్తాడా ఎప్పుడొస్తాడా అని కళ్ళు కాయలు కాచేలా కాచు క్కూచుని రాగానే స్వాగతమిచ్చాను...

వనజ– అబ్బ వెక్కిరిస్తున్నాడు చూడు చక్కనయ్య.

వెంక– మా చినబాబుగారి చక్కదనానికే వంకలెడతావ్... నీలాగ గిడసబారిన కోతిలా లేడనా... పోపోవమ్మా మా బాబుగారి నన్నావంటేనా...

వనజ– ఏంచేస్తావేం ?

వెంక– ఏంచేస్తానా ? ఏంచేయమంటారు అబ్బాయిగారూ ?

ముకుం– ఆవిడనే అడుగు.

వెంక– అదీ...తస్సాదియా...ఏం సిగ్గూ...ఏంవయ్యారం...

వనజ– ఇట్టయితే నే వుండను. నే వెళిపోతా...(వెళ్తూవుంటుంది)

ముకుం– మల్లెపూల వెన్నెలలో... (పాటగా)

వనజ— (తిరిగివచ్చి) ఆ పాట నాది. ఎవరూ దాన్ని పాడగూడదు . . . పాడితే అరెస్టు చేస్తాం.

ముకుం- కౌగిట్లోనా ! ? . . . (నాలిక కొరుక్కుంటాడు)

వనజ— (సాయంత్రం ఫలానా చోటుకి రమ్మన్నట్టుగా సంజ్ఞలు చేసి వెళ్ళిపోయింది)

ముకుం- ఓ. . .యస్. . .ఆలాగే. . .
వెంకన్నా సామాను లోపల పెట్టావా ?

వెంక— పెట్టానుగాని బాబుగారూ ఈ పాడుముండతో మీకేంటి సేయితం !

ముకుం- అవేంమాటలు వెంకన్నా !

వెంక— వున్నమాటన్నాను అబ్బాయిగారూ !

ముకుం-ఏమిటి నీ ముఖం. వున్నమాట. . . లేనిమాట . . .

వెంక— దీనమ్మ మంచిదికాదంటారుగాండి . . . వోడితోనో లేచి వచ్చిందంటగా. . .

ముకుం- అయితే !

వెంక— ఈ వనజమ్మ వోరికి పుట్టిందికూడా తెల్దండీ ! ఆ పంతులు దీని తల్లి లేదటండీ దుర్గమ్మ, దాన్ని వుంచుకున్నాడని కూడా అనుకొంటున్నారు .

ముకుం- ఏడ్చినట్లే వున్నాయ్ నీ కబుర్లు . తల్లి చెడ్డదైతే పిల్లలు కూడా చెడిపోవాలని ఎక్కడుందిరా . . . అలాంటిదేమన్నా వుందా చెప్పు .

వెంక— నాకు తెలీదండి. కుఱ్ఱకారంతా ఈ వనజమ్మంటే పడి
చస్తారు. కానీ ఆ యింటి చాలికి కూడా రానీదటండి.

ముకుం— సరేగాని పంతులుగారున్నారా వూళ్లో.

వెంక— వున్నారండీ... ఇంతకుముందే ఇక్కడకొచ్చి వెళ్లారు.
ఆయన పని మా జోరుగావుంది. వూళ్లోజనం పంతు
లంటే పడిచస్తారు. అదేదో పార్టీఅట. పార్టీలో చేరి
పోయూట్ట గాండీ! అందుకే కామాలు చెడిపోయూరని
కూడా అంటారు.

ముకుం— ఆ గొడవలు నీకెందుకుగానీ, ఆనక వెళ్ళి నే వస్తానని
చెప్పు పంతులుగారింకో. ఆఁ...నాన్నేడీ!

వెంక— యెక్కడికో వెళ్ళి వుంటారండీ!

ముకుం— అమ్మో?

వెంక— మామయ్యగారొచ్చి నిజాంపట్నం తీసుకెళ్ళారుగా.

ముకుం— సరేలే వెళ్ళి నీళ్లుతోడు స్నానం చేయూలి...

వెంకడు వెళ్తాడు. కొంచెసేపు పస్తాయించి
ముకుందరావు స్నానానికి లోపలికి వెళ్తాడు.

పాప— ఎవర్రా అబ్బాయ్ యింట్లో ఎవరూ పలకరేం?...

వెంక— ఎవరూ? (గొంతు వినిపిస్తుంది)

పాప— నేను పాపయ్యాని. ఇంకా మాధవయ్యబావ వూళ్లోనుంచి
రాలేదురా వెంకా...

వెంక— రాలేదయ్యా.

పాప– పోనీలే కూచుంటాను... ఆఁ... అన్నట్టు ముకుందరావు వచ్చాట్రా బండికీ ...

వెంక– వచ్చారండి స్నానం చేస్తున్నారు.

పాప– ఓహో దొరగారు దిగారన్నమాట...ఇవాళ మన బస్తీ ప్రయాణం వాయిదా వేసుకోవలసి వచ్చేటట్టుందే.

మాధవయ్య బజారునుండి వస్తాడు

మాధ– ఏం పాపయ్యా ఇప్పుడేగా వెళ్ళింది అప్పుడే వచ్చావేఁ?

పాప– అర్జంటుగా ఊరుకు వెళ్ళాల్సిన పని వచ్చింది మీతో చెప్పి పోదామని...

మాధ– ఏమంత తొందర.

పాప– డాక్టరు. సుబ్బారావు గారికి వస్తానని మాటిచ్చాను. ఇవాళరాత్రికి మదరాసు వెళ్తున్నాట్ట. అసలు నన్ను కూడా మద్రాసు రమ్మన్నాడు. వెళ్ళాలనుకున్నాను. కానీ మన వ్యవహారాలు యిలావుంటే ఎట్లా వీలవుతుంది!

మాధ– పోనీ వెళ్ళి ఆ పనేదో చూచుకొని చక్కా రారాదూ!

పాప– అంత తొందరేం లేదులెండి. ఇవ్వాళ కాకపోతే మరో సారి వెళతాను. మద్రాసుదేముందీ ఒకపూట ప్రయాణం... అన్నట్టు ముకుందరావ్ వచ్చాట్టగా.

మాధ– ఊఁ .....

పాప– వారితో కొన్ని అవసరమైన విషయాలు మాట్లాడాలి.

మాధ- నే మాట్లాడతా లేవయ్యా.

పాప- కాదు మీకు చెప్పకూడని విషయాలు కొన్నివున్నాయ్ అవి నేనే స్వయంగా సంప్రదించాలి.

మాధ- నాతో చెప్పగూడని రహస్యా లేమిటయ్యా ?

పాప- ఏముంది మన వాణ్ని కొంచెం కట్టుదిట్టం చేయాలి. ఆ పంతులున్నాడు చూచారూ... వాడితో తిరగనియ్య కూడదు.

మాధ- ఏం తిరిగితే... ఏం నష్టం ?

పాప- ఏం నష్టం...? మీకు తెలీదు. పంతులు అసలే కమ్యూనిష్టని ఇప్పటికే మోగిపోతోంది. వూళ్లో సగం మంది వాడిమాటమీద నడుస్తున్నారంటే అతిశయోక్తి గాదు! ఇప్పుడు మనవాణ్ని గనక తనవలలో వేసు కున్నాడా మనకిక మంచినీళ్లు పుట్టవు.

మాధ- అదేమిటయ్యా ?

పాప- కాదండీ మీకు తెలీని వ్యవహారాలు. ఆ దుర్గాంవుంది చూచారా...

మాధ- ఆc... ఆc... అదేసతో వుందనే అంటారు.

పాప- దానికొక కూతుకుంది వనజని తెలిసే వుంటుంది.

మాధ- వనజ! ఎక్కడో విన్నట్లే వుంది.

పాప- రత్తమ్మప్పకి తెలుసు. అప్పుడప్పుడు ఇక్కడికి వస్తుం టుందా పిల్ల.

మాధ- అయితే ఏమిటి ఆ పిల్ల ?

పాప- మన పంతులిక్ ఆ దుర్గాం ముండకీ సంబంధం వుందని లోకం ఎరుగు...పోతే ఆదుర్గాం కూతురుందిచూచారూ అది మన ముకుందరావ్ అంటే తెగమురిసి పోతుందని అంటారు. చదువున్నవాడు అందమైనవాడు ఎవరు మాత్రం కాదంటారు.

మాధ- ఆఁ ఏమిటీ ! ?

పాప- పంతులు ఆ వనజను మనవాడిమీదికి వుసిగొల్పి, దాని ద్వారా మనవాడిని బుట్టలో వేసుకుంటాడేమోనని నా భయం.

మాధ- భలే వాడివి పాపయ్యా... లాయరు బుఱ్ఱలాగుందే నీది మరిన్ని...

పాప- అలా జరగడానికి అవకాశం వుంది చూడండి. కీడెంచి మేలెంచ మన్నారు. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం లాభం ముందే జాగ్రత్త పడాలి గానీ...

మాధ- మావాడు అంత తెలివితక్కువపని చేస్తాడని నేననుకోను.

పాప- మీరనుకోండి అనుకోకపోండి. నాకనవసరం. వున్న లా పాయింటు చెబుతున్నాను.

మాధ- మనవాడేమిటి .. ఆ చెడిపోయిన దాని కూతుర్ని, అహా...హా... ఏం అనుమానాలయ్యా మీకు. అర్థం లేని అనుమానాలు... అర్థంలేని కథానూ

పాప— కాదండీ మాధవయ్యగారు. అసలు బ్రిటీష్‌వాళ్ళ రాజకీయాలు యిలాగే వుంటాయంటారు. ఎంతవరకు నిజమో నాకు తెలీదు. అయినా పనులు సాధించుకోటానికి ఎన్ని ఎత్తులైనా వేస్తారు. తనుగన్న కూతురైతే అనుకోవచ్చు. ఎవడికో పుట్టినపిల్ల చెడితే వాడికేం బాగుంటేవాడికేం. పంతులు మనం యిన్నాళ్లనుండి అనుకున్నంత అమాయకుడు గాదు. చాణుక్యుడి బుద్ధి అతన్ది.

మాధ- బాగుంది... ఈవ్యవహారం ఎలాచెబుతావు వాడికో... మీదపడి కొట్టినా కొట్టగలడు కోపంవచ్చి...

పాప— పోనీ మీరే చెప్పి చూడండి మాటవరసగా... ఎందుకైనా మంచిది. ఆ పంతులుకో తిరగకుండా చేయడం ఒకఎత్తు... ఆ దుర్గాం కూతురును కలుసుకోనీకుండా చేయడం రెండో ఎత్తు. పోనీ ఒక విషయం చెప్తాను చేస్తారా...

మాధ- చెప్పు చూదాం.

పాప— రత్తమ్మ ఇప్పుడెట్లాగూ వూళ్లో లేదుగనుక మనవాణ్ని కూడా మేనమామల యింటికి పంపకూడదూ మన పనులు చక్కబడే వరకూ. మనవిషయాలేవీ తెలియక ముందే పంపటం మంచిదని నా సలహా... తర్వాత మీ యిష్టం.

మాధ- ఈ వ్యవహారాలన్నీ మహా గందరగోళంగా వున్నాయి నా కేమీ అర్థం కావటం లేదు.

పాప— రాజకీయాలంటే ఏమనుకున్నారు. చుట్ట కాల్చుకుంటూ అరుగుమీద కూచ్చుని ఆ కబుర్లు, ఈ కబుర్లు దంచటం అనుకున్నారూ... సరే నేను వెళ్లొస్తాను... అవతల పనివుంది... (వెళిపోతాడు)

మాధ— అరేయ్ వెంకడూ!

వెంక— వొస్తున్నానండీ అయ్యా.

మాధ— అబ్బాయి ఏడీ? ఎక్కడికి కెళ్ళాడూ?

వెంక— యాడికీ వెళ్ళలేదండీ...స్నానంచేశాడు యిప్పుడే...బట్టలు కావాలంటే యిస్తుండాను.

ముకుం— (వస్తాడు)

మాధ— ఏంరా, ఎంతసేపాయెవొచ్చి.

ముకుం— ఇంతకుముందుగానే నాన్నా వొచ్చాను.

మాధ— పరీక్షలు, బాగా వ్రాసినట్టేనా?

ముకుం— ఫరవాలేదు...ఆఁ అమ్మ మామయ్యగారి వూరెళ్ళిందటగా... ఎప్పుడు?

మాధ— ఆఁ వెళ్లింది. నిన్నూ తీసుకువెళ్లాలనుకున్నాడు మీ మామ. నువ్వు రాగానే పంపమని చెప్పివెళ్ళాడు.

ముకుం— నే నెందుకు?

ముకుం— ఏవో సంబంధాలు వున్నాయని చెప్పాడు. అవన్నీ మీరుమీరు చూచుకుందురుగాని. అన్నట్లు మీ అమ్మ గూడ అక్కడే వుందిగా. వెళ్ళి పదిరోజులపాటువుండి

ఆ విషయాలేవిటో, ఎవరో ఆలోచించి వొచ్చేప్పుడు మీ అమ్మను వెంటతీసుకురా . . .

ముకుం– ఇప్పుడెందుకునేను . . . మొన్ననేగా పరీక్షలైనాయి. . . వొచ్చింది యివ్వేళ. మళ్లీ యింతలోకి ప్రయాణమా ?

మాధ– మరేం ఫర్వాలేదు . . . ఆయన అంతగా రమ్మని చెప్పినపుడు వెళ్ళకపోతే బావుండదు.

ముకుం– ఆయనకేం రమ్మంటాడు. అంత గొంతుమీదకేం వొచ్చింది. సంబంధాల విషయమే అయితే తొందర పడవలసిన అవసరం లేదు.

మాధ– అదేమిటిరా . . . ముద్దొచ్చినపుడే చంక నెక్కాలి అన్నారు పెద్దలు. ముప్ఫయివేలు కట్నం, ఇరవైఎకరాల మాగాణి . . . ఏం చేదయిందా ?

ముకుం– వేలు ఎకరాలు ఎవర్ని ఉద్ధరిస్తానికి. మనకి లేకపోతేగా.

మాధ– ఎవర్నో ఎందుకు ఉద్ధరిస్తాయి నాయనా నిన్నేగానీ . . . వెనకటికి నీలాంటి ఆయన ఒకడు అన్నాడట 'ఆలికి అన్నం పెట్టటంకూడా లోకానికి ఉపకారం చేసినట్టే' నని అలావుంది నీ వరస. సుఖంగా పెళ్ళిచేసుకోమంటే పెంకెపట్టు పడతావేం ?

ముకుం– ఆఁ వెళ్ళొచ్చులే తొందరేమిటి ?

మాధ– సరే నీయిష్టంబాబూ. ఆయనచెప్పమన్నాడు, చెప్పాను–

ముకుం– అంత తొందర పనికిరాదు నాన్నా. నిన్న పరీక్షలైనాయో లేదో అప్పుడే కట్నాలు పెళ్ళి అంటే ఎలా బతికేది చెప్పు. కాదంటే మీకు కోపం . . .

మాధ- నా కెందుకురా మధ్యన కోసం. నీ మంచిగోరి చెప్పే వాణ్నేగాని చెడిపొమ్మని చెప్పనుగదా? సరే నీయిష్టం. ..

ముకుం- అయితే తర్వాత పోతాంలే . . .

మాధ- వుంటే వుండు పోతే పో నాకెందుగ్గానీ, ఒకవిషయం మాత్రం ఆలోచించుకో. వూళ్లో పరిస్థితులు చూచావూ ఏమీ బాగాలేవు. నలుగురు నాలుగువిధాల అంటారు. నీకేం తెలియనట్టు వూరుకో . . . ఆ పంతులున్నాడు చూచావూ . . . చెడిపొయ్యాడని అనుకుంటున్నారు !

ముకుం- మనపంతులుగారే ?

మాధ- ఆఁ మనపంతులుగారే . . . వూళ్లో అందరికీ వేళ్లైనాడు. పైగా కమ్యూనిస్టు అయ్యాడనికూడా పుకారుగావుంది. ఈ కమ్యూనిస్టులున్నారు చూచావూ చాలా ప్రమాదమైనవాళ్ళు . . . వాళ్ళతో తిరగటం ఏమిటి, మాట్లాడడం ఏమిటి మహా ప్రమాదం . . . అదొక్కవిషయం జాగ్రత్త. తర్వాత చెప్పలేదనుకుంటావు . . .

ముకుం- మీరు అంతగా చెప్పకపోతే నాకు తెలియదూ ! నా కాలేజీ జీవితంలో ఎందర్నో చూడలేదు. ఒక కమ్యూనిష్టులేమిటి, సోషలిష్టులేమిటి, వందలమందిని చూచాను. వాళ్లందరూ అపకారంచేసేవాళ్ళనే అనుకుంటావూ . . . గోరంతలు కొండంతలుచేసి, అయినదానికీ, కానిదానికీ అనుమానించటం ఈ మనపల్లెటూరి దిక్కుల్లో అలవాటు గానీ చదువుకున్నవాళ్ళలో అలాంటివేమీ లేవు.

మాధ- అబ్బాయ్ ! బస్తీవ్యవహారాలు వేరు. పల్లెటూరి వ్యవహారాలు వేరు. అక్కడంటావ్ ఎవరి సొంతవ్యవహారాలు వారు చూచుకునేవారేగానీ యితరులకు అపకారం చెయ్యాలని అనుకోరు. ఇక్కడంటావ్ గోరంతలు కొండంతలు చేసుకోవటం అలవాటే. అందుకే మన జాగ్రత్తలో మనం వుండటం ఎందుకైనా మంచిదంటాను.

ముకుం- సరేలెండి.

మాధ- నేను యివ్వేళ బస్తీకి వెళుతున్నాను. కొంచెం పనివుంది. ఆ పాపయ్యా నేను తోడుగా వెళుతున్నాం.

ముకుం- పాపయ్యనుగురించి అలా అంటారేమిటి నాన్నా. నాకు అప్పుడప్పుడు తెలుస్తూవుండేది. మరీ అన్యాయాలకి దిగాడనీ, పాపానికికూడా దడవడనీ . . .

మాధ- అబ్బాయ్ ఒకమాట చెవుతాను వింటావ్రా ? గిట్టని వాళ్లు అనేకం అంటారు. పైగా వూళ్లో పార్టీలంటూ వడ్డప్పుడు ఎదురుపార్టీవాళ్లు అనేకం అనటంగూడా సహజమేగదా !

ముకుం- ఎవరైనా వున్నవిషయం చెప్పుకుంటారుగానీ అబద్ధం చెప్పరుగదా !

మాధ- వెంకడూ ఆ పైపంచె, కర్రా పట్టుకురారా ! ఆఁ లక్ష అనుకుంటారు పోనీరా మనకెందుకొచ్చిన పీకులాట . . . ఎవరెట్లాపోతే మనకేం . . .

వెంక- (తెచ్చి యిస్తాడు)

మాధ- ఆఁ సరే నే వెళ్లొస్తాను.

ముకుం- వెళ్ళిరండి.

మాధ- కొంచెం జాగ్రత్తగా వుండు. ఇవ్వేళే . వొచ్చావా . . నలుగురు నాలుగు రకాలుగా సూస్తారు... వంతులు విషయం చెబితినిగా జాగ్రత్త... అంతగా పట్టించుకోకు నీ కెందుకు...

(వెళిపోతాడు)

ముకుం- పంతులంటే మీా కళ్లకు యముడులాగా వున్నాడే! ఇంతకాలం మంచివాడైన పంతులు కాస్త ఎదురు తిరిగే సరికి చెడ్డవాడైనాడూ! ఏం మనుషులురా బాబూ!!!

వెంక- మీా కెందుకండీ అబ్బాయిగారూ! ఆళ్లజోలికి ఎల్లమాకండి.

ముకుం- నీకూ భయమే పంతులంటె?

వెంక- నాకేం భయమండీ!

(నవ్వుకుంటాడు)

# రెండవ రంగము

వనజయిల్లు పెద్దఆడంబరం లేకపోయినా వున్న దానిలో సామాన్యంగా అందంగా అమర్చబడి వుంది. నాగరికతా రీతుల్లో అలంకరణలు ఆ యింట్లో. ఒంటరిగా కూర్చుని చదువుకుంటూ వుంది వనజ. వస్తుతః పెద్దగా చదువుకున్న వ్యక్తి కాకపోయినా వున్న కొద్దిసాహిత్యవిజ్ఞానాన్ని సద్వినియోగం చేసుకోవాలన్న ఆకాంక్ష ఆమెకున్నట్టు అవుపిస్తుంది. ముకుందరావు స్నేహం వల్ల అలవడ్డ పద్ధతులు, అబ్బిన సంస్కారం ఆమెకి వన్నె తెచ్చాయి. చదువుతున్న పేపరు [illegible] కిటికీలోంచి ఎవరికోసమో ఎదురుచూస్తోంది. దిగులుగాబలువుగా పంతులు ప్రవేశిస్తాడు. బాధ, చికాకు అతనిప్రవేశంలో ద్యోతకం అవుతున్నయ్

వనజ– పంతులుగారా !

పంతు– (అవునన్నట్లు తలెత్తి బాధగా చూస్తాడు)

వనజ– అట్లా దిగులుగా వున్నారేం ?

పంతు– ఏం లేదమ్మా ?

వనజ– చెప్పండి... నాతో చెప్పటానికేం ?

పంతు– కొంచెం మంచనీళ్లందుకోమ్మా ... ఈ వూళ్లో నన్ను బ్రతకనిచ్చేట్టు లేరు.

వనజ– (మంచినీళ్లిస్తూ) ఏం జరిగిందండీ ?

పంతు– అనుకున్నంతా జరిగింది. మొదటినుండి అనుమానిస్తూనే వున్నాను... ముక్కుకు సూటిగాపోతే వాచ్చే తిప్పలే యివి...

వనజ– ముకుందంగారేమైనా అన్నారా ?

పంతు- అతనెందు కంటాడమ్మా. చదువుకున్నవాడు, శాస్త్ర బుద్ధి వంతుడు ఈ వూళ్లో నిజంగా అతనొక్కడే అవుపిస్తున్నాడు. మిగతావాళ్లు వొట్టి పశువులు... న్యాయా న్యాయాలు విచారించలేని మనుషులు.. నిజానిజాలు తెలుసుకోలేని వ్యక్తులు.

వనజ- ఏమయిందో చెప్పండి...

పంతు- వొద్దులే తల్లీ వొద్దు... చెప్పి నిన్ను బాధించిన వాణ్ణవుతాను.

వనజ- మీకు కష్టం కలిగితే నాకుమాత్రం కలిగినట్టు కాదుటండీ. మీరు సుఖంగా వుంటేనే మాకూ సుఖం... అమ్మకూడా చెప్పలేదే మీరిట్లా వున్నారని... తెలీదాండి అమ్మకు?

పంతు- అమ్మ! మీ అమ్మనుచూచి నన్నుచూచి కళ్లలోనిప్పులు పోసు కుంటోంది లోకం. ఓర్వలేక ఏడ్చిపోతుంది. ఒకళ్లు పచ్చగావుంటంచూచి సహించలేరుగదా మానవులు.

వనజ- అనుకోనీండి పంతులుగారూ! ఇంకా యింకా అనుకోనీండి మనకేమిటినష్టం. మనల్నేమన్నా ఈ అనేవాళ్లు పెట్టి పోషిస్తున్నారు గనుకనా...

పంతు- అలా అనకుతల్లీ! లోకం పోకడఅది, బాగుంటే ఫలానా వాళ్లు బాగున్నారేఅని ఏడ్చిపోతారు. చెడిపోతే మొఖం చూడరు కనీసం. లోకం తత్వమే అంత. ఇంతకీ నే చేసుకున్న కర్మ అలాంటిది ఒకర్ననే పనేముంది!

వనజ– కర్మ, ఖర్మ... కర్మను నమ్ముకోబట్టే మన బతుకులు యిలా తగలడుతున్నాయి.

పంతు– ముకుందం వచ్చాడమ్మా యివ్వాళ...?

వనజ– లేదండీ! వారికోసమే ఎదురు చూస్తున్నాను... ఈ వేళకి రావలసిందే.. తప్పకవస్తానని చెప్పారు. కానీ యింకా రాలేదు... ఏం పనివుండి వున్నారో యేమో!

పంతు– రాడుతల్లీ రాడు! ఎవరూ రారు... ఎవరూ సాయ పడరు... ఎవరికి ఎవరూ ఏమీకారు... బాగున్న ప్పుడు అంతా మంచిగా మాటలు చెప్పేవాళ్ళే గానీ ఆపదల్లో అదేమని అనేవాళ్లుగానీ, ఆదరించేవాళ్లుగానీ వుండరు..

వనజ– అసలు విషయంచెప్పకుండా ఎందుకలా బాధ పెడతారు. మీరు బాధ పడటమే గాక ఎదుటివాళ్ళనుగూడా బాధ పెడుతున్నారు.

పంతు– ఈ వూళ్లోంచి మీరో, నేనో వెళ్ళిపోవలసిన రోజు వచ్చింది. అందరికీ నేనంటే కసి ఏర్పడ్డది. మనవల్ల వూరుచెడి పోతోందిట... వూరి గౌరవప్రతిష్టలు నాశ నం అవుతున్నాయిట. బాగున్నవాళ్లు చెడిపోతారుట మనల్ని చూచి.

వనజ– ఎవరా అన్నది...

పంతు– వాళ్లకేంతల్లీ అంటారు... యింకా అంటారు యింకా అంటారు... అననీ ఏం చేస్తాం... పడక తప్పుతుందా రోజులు మనవి కానప్పుడు.

వనజ— ఒకసారి గడ్డి పెడితేగాని బుద్ధిరాదు ... రెండోసారి నోరెత్తకుండా వుంటారు . . ఎవరెట్లాపోతే వాళ్లకేం . . మనం వాళ్లకేం అపకారం చేశాం మనల్ని ఆడిపోసుకోడానికి.

పంతు— పిచ్చితల్లీ ... పిచ్చితల్లీ ... ప్రపంచం నీకుఅర్థంకాదు . . నీకు తెలిసింది కొద్ది. నువ్వు ఎరిగింది కొద్ది మందిని. అదిచూచి ఇదేలోకం, వీళ్లే మనుష్యులు అని అనుకుంటున్నావ్... కానీ కాదు...

వనజ— కాదు పంతులుగారూ! మిమ్మల్ని ఎవరైనా ఏమైనా అంటే వాళ్ల పాపాన వాళ్లు పోతారు విచారించకండి.

పంతు— పాపం! ఎవరుపోతారు... పాపం, పుణ్యం ఎప్పుడు ఎక్కడ అనుభవిస్తారో ఎవరుచూచారు?... ఇప్పుడు, యిక్కడ అనుభవించవలసిన వాళ్లం మనం... ఒకసారి ముకుందాన్ని కలుసుకొని చెప్పిపోతాను. తర్వాత చెప్ప లేదని అనబోతాడు.

వనజ— మీరంటే ప్రాణంయిస్తారు ముకుందరావు. చాలా మంచివాడు. అచ్చగా మాధవయ్యగారిబుద్దే...తండ్రికి తగ్గ కొడుకనిపించుకున్నారు.

పంతు— మాధవయ్యా!!

వనజ— అవును పాపం! ఎవరి జోలికీరాదు. తనేమో తన యిల్లేమో!

పంతు– నువ్వనుకున్నంత మంచితనం ఆయనలో లేదమ్మాయ్. నువ్వెరిగున్న మాధవయ్యకూ ఈ నాటి మాధవయ్యకూ చాలా తేడావుంది. ఒకనాడు చాలమంది అతని చేతిలో కీలుబొమ్మలు. ఇవేళ ఒకరి చేతిలో అతను కీలుబొమ్మ.

వనజ– ఏమిటి చిత్రంగా మాట్లాడుతున్నారు.. నిజంగా మాధవయ్య మంచివాడు కాదంటున్నారా పంతులుగారూ? వేళాకోళం కాదుగదా!

పంతు– అనుభవించి చెప్తున్నా తల్లీ! వేళాకోళంగాదు. ఆయనవల్లనేగా నాకీతిప్పలు. ఇంతకీ ఆయన గార్ని అని మాత్రం ప్రయోజనం ఏముంది ... పట్టిన గ్రహాలు అలా చేస్తున్నాయ్.. ఎలాంటి వారు ఎలా మారి పోతారు! ... ఆయన్ని చూస్తే జాలివేస్తుంది. చేసిన పనికి కోపం వస్తుంది.

వనజ– ఏం చేశారు!

పంతు– ఏం చేయాలి. తనకు అండగా నిలబడమని అడిగాడు. కొన్ని పరిస్థితులవల్ల వీలుకాదన్నాను. ఆ కసితీర్చుకోవడం కోసం తనకి బాకీవున్న రెండువేలు నిమిషాలమీద తీర్చమని కబురుచేశాడు... లేకపోతే ఏంచేస్తానో వూహించుకోమన్నాడు.

వనజ– అంతప్రమాదమైనపని ఏంచేస్తాడు?

పంతు– ఏమైనా చేస్తాడు...చేయగల సమర్థుడు. ఇంతకీ ఆ పాపయ్యగాడు పన్నిన కుట్ర. వాడికి యిష్టమైతే ఏగడ్డైనా

కరుస్తాడు. లేకపోతే అవాకులు చవాకులు కల్పించి ఏదో దారుణంచేస్తాడు. దుర్మార్గుడు నీతి నియమంవుంటేగా !

వనజ— పాపయ్య వలలో పడ్డాడన్నమాట !

పంతు— అదేతల్లీ అదే...ఏంచెప్పను... భయంగావుంది. వాళ్ల చేతుల్లో రౌడీముండాకొడుకులున్నారు కూడా. ఏ నిమిషాన ఏం కొంపమీదకి తెస్తారోనని భయం.

వనజ— ఇంత అన్యాయం జరుగబోతుంటే అందరూ వూరుకున్నారా! చేతులుచచ్చి కూచున్నారా ... ముకుంద రావుకు తెలిసే వూరుకున్నాడంటారా ?

పంతు— అతనికి తెలిసివుండదు బహుశా, తెలిస్తే జరగనీడు ...

వనజ— తండ్రిచేసే దారుణం కొడుక్కి తెలియకండా వుంటుందంటారా ? తెలిసే మౌనంగా వూరుకున్నాడేమో !

పంతు— నేననుకోను అతనల్లా వూరుకుంటాడని...

వనజ— మీరు ఏదీ అనుకోరు. అందర్నీ నమ్ముతారు.. చివరకు గొంతుమీదకి వచ్చినప్పుడు విచారిస్తారు.

పంతు— ఈ పల్లెటూళ్లో యింక బ్రతకలేమమ్మా...ఎక్కడికైనా పోవటం మంచిది.

వనజ— మీరే భయపడి పారిపోతే మేమేంకావాలి చెప్పండి. ఇక్కడేవుండి కార్యం సాధించాలిగాని పారిపోతే ఎలా !

పంతు— లాభంలేదు... ఈ గడ్డకూ నాకూ ఋణంతీరిపోయింది.

వనజ— ఎవరా వెళ్ళేది ముకుందరావనుకుంటాను... ఏమం డోయ్...మిమ్మల్నే...

ముకుం— (వస్తాడు) ఓహో... పంతులుగారిక్కడేవున్నారా... ఎవరోననుకున్నాను.

వనజ— అనుకుంటారు బాబూ అనుకుంటారు... అనుకోరు మరీ!

ముకుం— అదేమిటి వనజా... నే వెదుకుతూంది పంతులుగారి కోసమే. పంతులుగారింటిదగ్గరనుండే వొస్తున్నాను.

వనజ— అయితే అలా పైకి వెళ్ళిపోతున్నారేం.

ముకుం— ఇక్కడున్నారని నాకేం తెలుసు. వారింటికి వెళ్ళి అడి గితే యింకా రాలేదు బహుశా మీ కారు వెళ్ళివుంటా రేమో నన్నారు. అందుకని అలా వెదుకుతున్నాను.

వనజ— ఓహో అదా సంగతి!

ముకుం— ఏమిటి ఆ అర్థం లేని మాటలు నేనప్పాను.

వనజ— ఆడింది నాటకం అయినా బాగా అతికిపోయింది.

ముకుం— నాటకమా...నాకు తెలీదే...

వనజ— కాకపోతే తమరు పంతులుగారింటికి వెళ్ళటం, రావటం, వెదుక్కుంటూ పోవటం... ఆశ్చర్యమేంటి పంతులుగారు యిక్కడ వుంటారని బహుశా మర్చిపోయివుంటారు! ఎవరో ననుకున్నారుగదూ! ఎవరనుకుంటే వారుండటానికి ఇదేం సానికొంపగాదు!

ముకుం— యథార్థంగా నాకు తెలియదు వనజా!

పంతు— లోకానికి అంతా తెలిసినప్పుడు నీకు తెలియదంటే ఆశ్చర్యంగానే వుంది. ...ఎవరూ చెప్పలా బాబూ పంతులు దుర్గమ్మని ఉద్ధరిస్తున్నాడని. ..చెప్పేవుంటారే !

వనజ— చెప్పేవుంటారు కానీ నాయనగారు వినేవుండరు.

ముకుం— చెప్పారు కానీ నే నమ్మలేదు...

వనజ— పోనీ యిప్పుడైనా నమ్మారా !

ముకుం— ఇప్పటికీ నమ్మ లేకపోతున్నాను. మనిషికి మనిషికీ మధ్య అనేక అవసరాలుంటాయి. అవి ఆధారంగా తీసుకుని సంబంధాలు కల్పించటం నే నొప్పుకోను.

వనజ— ఓహోహో! ఏమిదాతృత్వం, ఏమిధర్మగుణం...ఆఁ...

ముకుం— వనజా !

వనజ— సరేగానీండి నాన్నగారి నాటకంలో తమరికి పాత్ర ఎంత ?

పంతు— నువ్వూరుకో అమ్మాయ్.....

వనజ— ఉన్నమాటంటే ఎవరికైనా ఉలుకెక్కువే...నేనేం కాని మాటన్నానా అంతకోపం.

ముకుం— నోటికొచ్చిన ప్రతిమాట అనగానే సరిపోయిందా.

వనజ— కాదంటే దొరికారూ...పంతులుగారి వద్దకు బాకీ వసూళ్ళకు తమన్ని నియమించారటగా మాధవయ్యగారు ... వసూలు చేసుకోండి వృద్ధి చెయ్యమో !

ముకుం– ఏమిటిదంతా అగమ్యంగావుంది... ఏమిటండీ పంతులు గారూ మీరన్నా చెప్పండి ?

వనజ– అబ్బో ఏమీ ఎరగనట్లు...!

ముకుం– ముయ్ నోర్ ఎందుకలా నోరు పారేసు కుంటావ్...

వనజ– అమ్మో కోపంకూడా వచ్చిందే... ఏదీ మరొక్కసారి కోపం తెచ్చుకోండి చూదాం...

ముకుం– బాకీ ఏమిటి ? వసూళ్ళు !... వసూళ్ళేమిటి పంతులు గారూ ?

పంతు– ఏముంది. ఇచ్చినవాళ్లు తిరిగి పుచ్చుకోవటం, తీసు కున్నవాళ్లు తిరిగి యివ్వటం.

ముకుం– ఏమిటో మీరు అర్థం గాకండా మాట్లాడుతున్నారు.

పంతు– అంతే బాబూ అంతే!... లోకంయిది... మనుషులం మనం... అంతే బాబూ. మీ నాన్న గారికి ఈ మధ్య డబ్బుమీద కాపీనం బలిసింది. పాత బాకీలన్నీ వసూలు చేసు కుంటున్నారటగా... అన్నీ ఎక్కడలే చిన్న మొత్తాలు, నాలాంటివాళ్లు యివ్వవలసినవి ఇవ్వకపోతే వెంటనే కోర్టు కీడుస్తారట...అంతకన్న ముందుగా జరిగే మర్యాదలు మాదిగాళ్ల చాత, మాలాళ్ల చాత ఎలాగూ తప్పవ్...

ముకుం– ఈ అన్యాయం జరగటానికి వీల్లేదు పంతులుగారూ... నేనుండగా జరగదు, జరగనీయను నమ్మండి...

వనజ- నమ్మండి పంతులుగారూ నమ్మండి. ఈయన గారి మాటలు నమ్మండి... ఆ మాధవయ్యగారి కొడుకేగా నమ్మండి.

ముకుం- నిజం పంతులుగారూ అలా ఎన్నటికీ జరగదు...

పంతు- బాబూ నావల్ల మీ తండ్రీ కొడుకుల మధ్య వైరుధ్యాలు రావటం ఎందుకు చెప్పు. పరాయివాణ్ని పరాయిగానే పోతాను... ఎక్కడో ఒకచోట బ్రతకలేక పోనుగా! మీరుమీరు బాగుంటే అదే పదివేలు... నా మూలంగా గ్రామంలో కలతలు, కల్లోలాలు రావటం దేనికి?

ముకుం- నా మాటమీద విశ్వాసం వుంచండి. మీ కొచ్చిన భయం లేదు. మీకు కావలసిన సాయం చేస్తాను.

పంతు- వొద్దు నాయనా వొద్దు. నీ దగ్గర మాత్రం ఎక్కడిది ...... ఒకటి రెండూ కాదు రెండువేలు... ఎక్కడ తెస్తావ్?

ముకుం- ఆ బాధ్యత నాది... మీ పైన ఈగ వాలనీయను.

పంతు- లోకం ఏమనుకుంటుందో ఆలోచించేవా?

ముకుం- అనుకోనీయండి.

పంతు- 'ఈ పంతులు ముకుందరావును తనవలలో వేసుకున్నాడు ఏ మందు పెట్టాడో, మాకు పెట్టాడో, తండ్రికీ కొడుక్కీ ఎడం చేశాడు' అంటారు... ఇప్పటికే అనేకం అనుకుంటున్నారు... అమ్మాయికీ నీకూ...నేను...

ముకుం— చాలు వూరుకోండి... అంతా తెలుసు నాకు.

వనజ— ఎవరండీ అన్నది ... నాతో అనరేం ఆ అనేవాళ్లు...
ఏమండీ ముకుందరావుగారూ, మిమ్మల్ని నే రమ్మన్నానా!

ముకుం— అబ్బే వువ్వెందుకు రమ్మంటావ్ ...

వనజ— నువ్వోక దొంగవు ... ఈయనా ఆ కోవలో వాడే
ఈయన్ని నమ్ముకుంటే తిన్నట్లే.

ముకుం— నిన్ను నమ్ముకుంటే ?

వనజ— ఏమండోయ్ ముకుందరావుగారూ ! మేం ఈవూరునుండి
వెళి పోతున్నాం. తర్వాత మీయిష్టం... అంతేగదండి
పంతులుగారూ !

ముకుం— నేనూ మీతో వస్తాను.

వనజ— నువ్వెందుకు మాతో... నిన్నెవరు భరిస్తారు బాబూ !

ముకుం— మీరు యిక్కడ వుండనైనావుండాలి, లేక నేనుమీతో
రానైనా రావాలి. రెంటిలో ఏదోవొకటి తథ్యం.

పంతు— మా కోసం నువ్వు నాశనం కావటం ఎందుకు నాయనా,
మీ తండ్రి, మీరు, మీ వూరు... అంతా మీది ...
మీ దెబ్బకు తిరుగులేదు ఈ గడ్డమీద... దేవుడుగూడా
మీకు వెరుస్తాడంటే నిజం.

ముకుం— ఎక్కడికి వెళ్ళాలని పంతులుగారూ మీ ప్రయత్నం.

పంతు— ఎక్కడికైతే నేం... బ్రతుకు తెరువు చూచుకోటం
ప్రధానం.

ముకుం— ఒకవేళ యిక్కడే తెరువు దొరికిందనుకోండి, వుండి పోతారా ?

వనజ— ఓ తప్పకుండా వుంటారు.

పంతు— వుండను బాబూ వుండను...వుండలేను.

ముకుం— ఇంతకీ మీకు కావలసింది డబ్బు. రెండు వేలు... ముష్టి రెండు వేల రూపాయలకోసం ఉన్నవూరు వొదిలి పోవటం ఏమీ సమంజసం కాదని నా ఉద్దేశం... రెండు వేలు పుట్టకపోవు... ఎవర్నడిగినా యిస్తారు.

పంతు— ఎవర్నడగను ... అందరికీ చేదయ్యాను ... ఇరుపక్షాలకూ పనికిరాని వాణ్ని ఎవరు ఆదరిస్తారు !

ముకుం— నేను, ... నేను పంతులుగారూ ! ... మీకు డబ్బు రేపే అందేలా చేస్తాను సరేనా... నా మాటమీద నమ్మకం వుంచి నిశ్చింతగా నిద్రపోండి.

పంతు— సరే నే వెళ్ళి వస్తాను. వొస్తానమ్మాయ్.

ముకుం— సరేనండి.

పంతు— వస్తాను..

బయటకు వెళిపోతాడు. కొద్ది క్షణాల్లో
తిరిగి వస్తాడు. ఏదో మొంచుకుపోయినట్టు

పంతు— చూచావూ, ఆ పాపయ్యగాడు గోడ చాటున వుండి వింటున్నాడు.

పాప— (ప్రవేశించి) పాపయ్య ! పాపయ్య ! ...ఏం అపచారం చేశాడయ్యా పాపయ్య... వూరికే యిదవుతారుగానీ.

వనజ— చేసేదంతా నువ్వుగాక మరెవరు? పైగా ఏం అపచారం చేశానంటావ్రూ... ఎవరికి తెలియనివి నీ వేషాలు... ఊరుకే నీవల్ల అనర్థం వొస్తోంది.

పంతు— నువ్వూరుకోవమ్మా!

ముకుం— ఏమయ్యా ఈ దొంగపడుపులు ఏడ్వకపోతే... ఈ వెధవ ఉద్యోగం ఎప్పటి నుండి?

పాప— అబ్బే నేనేంచేశాను. ఏంచేయందే.

ముకుం— ఏంచెయ్యాలి, గోడచాటునవుండి వినటం చాలదూ! ఎవరుచెప్పారు ఈ పాడుపని చెయ్యమని.

వనజ— ఇంకెవరూ! వున్నాడుగా ఆ మాంధాత.

పంతు— అమ్మాయ్?

ముకుం— ఏం పాపయ్యా! నాన్న పంపేడా ఈ పనికి.

పాప— కాకపోతే నాకేం గాడెక్కిందనుకున్నావా!

ముకుం— ఆయనే చేయిస్తున్నాడన్నమాట... ఊఁ...ప్రాణాల మీద ఆశలు వొదులుకుంటే యిలాంటి పనులుచెయ్... ఇదిగో చెబుతున్నాను తర్వాత అనుకుని ప్రయోజనం వుండదు. ఫలానా ముకుందరావు చేశాడని ఏడ్చిపోతే గాదు...

పాప— అబ్బాయ్...

ముకుం— ముయ్ నోర్. అబ్బాయిట అబ్బాయి.

పాప- నిన్నేనయ్యా పంతులు ! మాధవయ్యగారు పిలుచుకు రమ్మన్నారు తమర్ని.

ముకుం- ఎందుకు ? పంతులురాడు. రావటానికి వీల్లేదన్నానని చెప్పు.

పాప- మీనాన్న రమ్మన్నాడయ్యా !

ముకుం- పో పోవయ్యా! ఆయన రమ్మనటం, నువ్వు పిలవటం, ఈయనగారు రావటం...వారెవా ఏం సొంపుగావుంది. పో నేచెప్పానని చెప్పు...పంతులు రావటానికి వీల్లేదు.

పంతు- అతనిమాటలకేం పాపయ్యా, వస్తున్నాపద...

ముకుం- మీరు వెళ్ళకండి పంతులుగారూ...దేవుడు దిగివచ్చినా మీరుకదలవద్దు. ఆవ్యవహారాలేవో నేచూచుకుంటాను.

పాప- అవసరంగా మాట్లాడవలసిన విషయాలున్నాయి పంతులూ.

ముకుం- నాకు తెలుసు ఆ విషయాలు ... నే సమాధానం చెప్పగలను పద...

పాప- పంతులు తరఫున వకాల్తా పుచ్చుకున్నావన్నమాట.

ముకుం- నీదేంపోయిందయ్యా పెద్దమనిషీ...నీలా నే నేం బ్రోకర్ ఉద్యోగం చెయ్యటంలేదు... న్యాయంకోసం నిలబడు తున్నాను. నీలాంటివాళ్ల ఆటలు సాగనీయకుండా చేస్తాను తెలిసిందా... అన్యాయాన్ని న్యాయంతో జయిస్తాను.

పోలి– అనవసరపు మాటలెందుకబ్బాయ్...మీ నాన్న మొఖం చూచి వూరుకుంటున్నానుగానీ లేకపోతే...

ముకుం– మా నాన్న మొహంచూచి ఊరుకోబట్టే నువ్వు బ్రతికి పోతున్నావ్. లేకపోతే తమరిగతి ఈ పాటికి ఏమయ్యేదో!

పాప– ఊఁ పెద్దమగాళ్లు బయల్దేరారు. ఏంచేస్తారయ్యా నువ్వూ నీ పంతులూ కలిసి. ఊరు ఊరంతా ఏకమైనా పాపయ్యను కదిలించలేరు అనుకుంటున్నారేమో... ఇట్లా వున్నాడనుకుంటున్నావ్ కానీ నా సంగతి నీకేం తెలుసు. తలుచుకుంటే ఈ పాపయ్య...

ముకుం– ఓయబ్బో మా లావు మగాడు బయల్దేరాడు. ఏమిటయ్యా నువ్వుచేసేది. అంత సమర్థుడవేఅయితే ఈ ఏడుపెందుకు! వెధవ బెదిరింపులు నువ్వూను.

వనజ– నిన్నసలు ఎవరురమ్మన్నారయ్యా పాపయ్యా యిక్కడకు.

పాప– ఒకడు రమ్మంటే వొచ్చేవాడుగాదుపీడు. అయినా ఈ చెడిబాకి కొంపలచుట్టూ తిరిగే అగత్యం నాకేంపట్టె!

పంతు– ఎందుకయ్యా ఆ మాటలు. చచ్చినపామును యింకేం చావగొడతావ్. ఒకరు తిరిగితే నీకేం, తిరక్కపోతేనీకేం నువ్వు నీతిగా వుండరాదూ!

పాప– ఇంట్లో బంగారంవంటి పెండ్లాం బిడ్డల్ని వొదిలి తిరిగే నువ్వా నాకు నీతులుచెప్పేది?

ముకుం– ఎవరయ్యా చెడిపోయింది. మేం చెడిపొయ్యామా? ఫోవాలేదు. నీవంటి తలలుమార్చే ఉద్యోగంకన్న ఈ విధంగా చెడిపోవటం మంచిది!

వనజ– ఈయనక్కడ పెద్ద బాగుపడ్డట్లు. మనం చెడిపోయినట్లు! ఈయన పెళ్లాంచేసేవన్నీ నీతిగలపనులు గావాల్లు.

పాప– ఏయ్ ముయ్ నోరు.

వనజ– నువ్వుమూసుకో...లోకం నోరుముయ్యి చేతనయితే అంతా అనుకున్నమాటే నేనూ అన్నాను. ఏం మాకు నీతులు చెప్పేవాడివి నీ పెళ్లానికి చెప్పుకోలేకపోయావా! బయటవాళ్లు తేరగా దొరుకుతారా మాకు అనటానికి.

ముకుం– అనుకోనీ వనజా. లక్ష అనుకోనీ ఏమిటి నష్టం.

వనజ– వీళ్ల యిళ్లలో అడ్డమైన చెడ్డపనులు జరుగుతుంటే కనిపించవ్ వీళ్ల కళ్లకు.

పంతు– ఎవరివాళ్ళను వాళ్లు వెనకవేసుకోక రచ్చకీడ్చుకుంటారా పిచ్చిదానా!

వనజ– ఏమయ్యోయ్ పాపయ్యా!... తమరు సెలవుపుచ్చుకో వచ్చు యిక్కణ్నించి.

పాప– ఊఁ! పోకపోతే...

వనజ– మెడబట్టి బయటకు గెంటవలసి వస్తుంది.

ముకుం– నువ్వు పోవయ్యా యిక్కణ్నించి.

పాప– సరే పంతులూ తొరగా రా. (వెళిపోతాడు)

పంతు– అమ్మాయ్! వెళ్ళొస్తానమ్మా.

ముకుం– మీ రెక్కడికండి... నే వెళ్ళొస్తాగా ఆ విషయం ఏమిటో.

పంతు— ఇంటికి వెళ్తాను పనుంది.

ముకుం— సరే మీ యిష్టం.

పంతు— జరిగే ఘోరాలు ఎలాగూ జరక్కపోవు... ఎదురు తిరిగి లాభం లేదు. వొస్తా ముకుందరావ్.

(వెళిపోతాడు పంతులు)

వనజ— అబ్బాయి గారికి సెలవుల్లో చేతినిండా పని దొరికింది.

ముకుం— నాలుగు రోజుల్లు విశ్రాంతిగా వుండొచ్చుగదా అని యింటికొస్తే తగూలు, కొట్లాటలు వూపిరి సల్పకుండా వున్నాయి.

వనజ— ఇక్కడేదో సుఖపడదాం అనుకున్నారు పాపం...

ముకుం— ఇదంతా నీ మూలంగా జరుగుతోంది. నువ్వు లేక పోతే ఈ గలభాలు వుండవు గదా!

వనజ— నేనేం చేశానండీ నన్నంటారు.

ముకుం— ఇంత చక్కని చుక్కవు వూళ్లో వుండటం అందరికీ కంటకంగా వుంది.

వనజ— చివరికి మీకుకూడానా!

ముకుం— అవేగా వచ్చిన తిప్పలు. నే నేమో యిక్కడ సుఖ పడు తున్నానని నువ్వు నాకేమో వొరగ బెడుతున్నా వని అందరూ ఏడ్చిపోతున్నారు. మన మధ్య అనవస రంగా నలిగి పోతున్నాడు పంతులు.

వనజ— నాకు తెలీకడుగుతాను మీ నాన్నకు పంతులుమీద ఎందు కండీ అంత కసి.

ముకుం— కసీ లేదు. ఏం లేదు. ఆయనకు చేదోడు వాదోడుగా పంతులు వుంటాడని ఆశించాడు. ఈయనేమో ససేమిరా తనవల్ల కాదన్నాడు. దానితో ఆయనకు శివాలెత్తింది. నిజం చెప్పాలంటే నాన్నకు పంతులంటే ఏమీ ద్వేషం లేదు.

వనజ— కాకపోతే ఈ గొడవంతా దేనికి ?

ముకుం— ఆ పాపయ్యగాడు అలా చేస్తున్నాడు. నాన్నను అనే పనేముంది. వాణ్ని వూళ్లోనుంచి వెళ్లగొడితే అసలు సగం పీడ వొదులుతుంది. ఏదోనని వూరుకుంటుంటే నెత్తి కెక్కుతున్నాడు.

వనజ— వినేవాళ్ళకు బుద్ధి లేకపోతే చెప్పే వారికైనా వుండవక్కర్లా చెప్పండి.

ముకుం— ఎవరు మాత్రం ఏం చేస్తారు చెప్పు. నేను ఏం చేయగలిగాను. వూరు వూరంతా ఒక్క తాటి మీదెక్కి కూస్తున్నా- యిక్కడకు రావటం మానుకో గలిగానా !

వనజ— పోనీ మానుకోపోయూరా ఎవరొద్దన్నారు.

ముకుం— ఏదో ఆకర్షణ, ఆ ఆకర్షణే లేకుంటే నువు రమ్మంటే మాత్రం వస్తానా !

వనజ— ఇదోటిపెట్టమాకండి స్వామీ నేనేదో మిమ్మల్ని వలలో వేసుకున్నా ననుకుంటారు. చిన్నప్పట్నించి ఒకచోట చదువుకుని, ఒకచోట ఆడుకున్నాంగనక రమ్మన్నాను. అంతకు తప్ప నాకేం చెడ్డబుద్ధి లేదు.

ముకుం- ఛా! ఛా! వుందని నేనుమాత్రం అన్నానా? అదే స్నేహం...అందుకేగా నేనూ వొస్తున్నాను.

వనజ- అని అందరూ అనుకోవద్దూ. ఆడది మగాడు కలిసి మాట్లాడితేనే రంకులు కట్టే ఈ మనుషులు...

ముకుం- కడతారు, ఎందుకు కట్టరూ!

వనజ- అవునండీ వాళ్ల బుద్ధులు అలాటివి. మీలాగా పెద్ద చదువులు చదివితే బావుండేది. అయినా ఇది మీకూ నాకూ తప్పుగాకపోవచ్చు... కాని మిగతా అందరికీ తప్పుగా... నిజంగా మనం...

ముకుం- ప్రేమించుకున్నామనో, పెళ్లిచేసుకుంటామనో అనుకుం టారు. అవునా...అదేగా నీ అనుమానం.

వనజ- అనుమానమేంకర్మ. నిజంగా అంతేననుకుంటారు.

ముకుం- ఒకవిషయం చెపుతాను వింటావూ! ఏడ్చేవాళ్లను మరీ ఏడ్పించాలి. అనుమానపడేవాళ్లను మరీ అనుమాన పడేట్లు చెయ్యాలి.

వనజ- మీకేం మీరు ఎన్నయినా చేస్తారు...చివరికి లోకం అనేది నన్ను. 'నీకు తెలియకపోతే ఆడది నాకైనా వుండ క్కర్లేదా' అంటారు?

ముకుం- 'మగాడికిలేని బుద్ధి ఆడదానికి మాత్రం ఎందుకుండాలి' అంటే సరిపోయె!

వనజ- అంటే సరిపోతుందీ...రేపు నలుగురిలో పట్టుకుని నిల దీసి అడిగితే తెలుస్తుంది.

ముకుం– ఎవరు అడిగేది. ఎవరికి దమ్ములున్నయ్ చెప్పు.

వనజ– ఒకవేళ అడుగుతారే అనుకోండి ఏంచెప్తారు ?

ముకుం– ఉన్నది వున్నట్లుగా చెబుతాను సరేనా !

వనజ– 'అబ్బే అలాగ్గాదు. ఆ అమ్మాయి ఎవరో నేను అసలు ఎరగను. ఎలావుంటుందోకూడా నాకు తెలీదు' అంటారు.

ముకుం– అట్లా ఎందుకంటాను.

వనజ– నాకు తెలుసులెండి. చాలా కథల్లో, సినీమాల్లో అట్లాగే అంటారుగా !

ముకుం– అవి కథలు, సినీమాలు. అవి వ్రాసేవాళ్లకు ఏమీ తోచక అలా వ్రాస్తారు. ఆ విధంగా సినీమాలు తీస్తారు. యదార్థంగా అలా జరుగుతుందనే నీ అనుమానం.

వనజ– ఎందుకు జరగదేమిటి ! మీ మగాళ్లు ఎప్పుడూ మోసం చేస్తారుటగా అమ్మ చెప్పింది.

ముకుం– మీఅమ్మ తెలివితక్కువది గనుక మోసపోయింది. మరి నువ్వు తెలివిగలదానివిగా, నువ్వు మీ అమ్మలాగా మోసపోతావా !

వనజ– మీరు చెప్పేమాటలు నిజం అని నమ్ముతున్నాగా మరి.

ముకుం– కాదంటావా ?

వనజ– ఏమో ఎవరికి తెలుసు. చివరికి కాదంటే మోసంచేసి నట్లుకాదూ !

ముకుం– అయితే నన్నూ అనుమానిస్తున్నావన్నమాట.

వనజ– ఇప్పుడు పంతులుగార్ని మోసంచెయ్యాలా. అలాగే నన్నూ మోసంచేస్తారని భయం.

ముకుం– పంతుల్నేం మోసంచేశాను ?

వనజ– ఆయనకు డబ్బు తెచ్చియిస్తానని చెప్పి యిక్కడ కబుర్లు చెబుతూ కూర్చుంటిరి . . .

ముకుం– ఓస్ అదా. తెస్తానంటినిగా. మరి వెడదామంటే నువ్వు వెళ్ళనీయకపోతివి. నిన్ను చూస్తుంటే పోవాలనిపించదు.

వనజ– ఛీ ! పొండి. అన్నీ పాడుమాటలు.

ముకుం– ఏం సినీమాల్లో, కథల్లో వినలా యిలాంటి మాటలు.

వనజ– వింటే !

ముకుం– అప్పుడు కలగని సిగ్గు యిప్పుడెందుకు కలగాలి చెప్పు.

వనజ– ఏమో నాకు తెలవదు.

ముకుం– అబ్బో ఏమీ ఎరగని నంగనాచి.

'అబ్బాయిగోరూ, అబ్బాయిగోరూ'
అని వెంకడి గొంతుక వినిపిస్తుంది.

వెంక– వనజమ్మా! చినబాబుగోరున్నారా? మీారిక్కణ్నే వున్నారు టండీ . . . పెద్దయ్యగారు చెప్పింది అచ్చరాలా నిజమన్న మాట.

ముకుం– ఏం వూరంతా గాలించి వొచ్చావా !

వెంక– నాకు తెలీదండీ మీారీడవుంటారని, అయ్యగారుకూడా సెప్పారుగా, అందుకే సరాసరి ఈడకే వొచ్చాను.

వనజ— ఎవరూ పంతులుగారా చెప్పింది ?

వెంక— కాదు మా అయ్యగారే !

ముకుం— నాన్నా ! ఆయన కెట్టా తెలుసు నేనిక్కడ వున్నానని.

వెంక— ఏమో నాకేం తెలుసండీ !

వనజ— పాపయ్య చెప్పాడేమో !

వెంక— కావొచ్చండీ...అందుకే కామాల్సు అయ్యగారు కూక లేస్తున్నారు...

ముకుం— ఎవరిమీద ?

వెంక— ఇంకెవరిమీనండీ. మీమీనే... మా చెడ్డకోపంగా వున్నారండీ !

ముకుం— ఎందుకు ?

వెంక— ఏమో ఆ యిసయం నాకెట్టా తెలుస్తదండీ...మీరిక్క డున్నారనేమో ! ఎళ్లి అర్జంటుగా పిలుచుకురమ్మన్నా రండి...

వనజ— వెళ్ళి అక్కడలేరు, అసలు అక్కడకు రారట అని చెప్పు.

వెంక— పానాలమీద ఆశలువుండే ! అయితే అబ్బాయిగారూ ఒకమాట అడగనాండి...

ముకుం— ఊఁ !

వెంక— కోప్పడరుగందా !

ముకుం— ఎప్పుడన్నా కోప్పడ్డానా నిన్ను ?

వెంక– లేదులెండి అందుకేగా సొతంత్రంగా అడుగుతానంట.

ముకుం– ఊః ఇంకేమిటి సంగతులు !

వెంక– పోనీ మీరు ఈడకు రాకుండా వుండగూడదుటండీ !

ముకుం– వొస్తేయేం !

వెంక– యేం యేమిటండీ...వ్రూళ్లో అంతా చెప్పుకుంటారట అదికాస్తా అయ్యగారి చెవ్ని పడ్డది... ఇంకేం మండిపోయి ధూం, ధాంలు చేస్తున్నారు.

ముకుం– ఏమిటి ఆయనచేసేది...నేనేం దొంగతనంచేశానా ?

వెంక– అదే మెరుగండీ ఈ పనికన్నా...

వనజ– అవునండీ ఈ వెంకడుకూడా సలహా చెబుతున్నాడు. రాకండేం.

వెంక– కాదండీ అమ్మాయిగారూ...పబ్లిక్‌గా వొచ్చేస్తే పట్ట పగలు నోరికి తెలవకుండా వుంటది సెప్పండిమీరు.

ముకుం– ఇందులో ఏంతప్పువుంది. ఏం పబ్లిక్‌గావొస్తే... ఎంత మంది యిళ్లకు వెళ్లటంలేదు. అట్లాకే యిక్కడకూ వొచ్చాననుకుంటే సరిపోయె. దీని భాగ్యానికి అందరూ చెప్పుకోటం అయ్యగారికి కోపంరావటం దేనికి ?

వెంక– సిన్నోరు మీకు తెల్దండీ...లోకం – పిచ్చికాకులు.

ముకుం– నాకు తెలుసు · వెంకన్నా. ఎవరేం అనుకునేది నాకు తెలుసు. కాని ఎలావస్తదో రానిమ్మని వూరుకున్నాను.

వెంక– ఎల్దాం పదండి. మీకోసం ఎదురుసూాత్తుంటారు అయ్య గారు.

ముకుం– కొంచెం ఆగి వస్తాలే నువ్వుపద. 'అక్కడ ఏమిటో మాట్లాడుతున్నారు వొస్తానని చెప్పమన్నారు' అని చెప్పు సరేనా ?

వెంక– సరేనండి ! (వెంకడు వెళతాడు)

ముకుం– నేనూ వెళ్లొస్తా వనజా......

అతను పోతుండగా తెర

# మూడవ రంగము

మాధవయ్య యిల్లు. మొదట రంగంలో చూపినగది అందంగా అమర్చబడి వుంది. గోడలకు రాజకీయ నాయకుల ఫోటోలు రాక్‌లో పెద్ద పెద్ద పుస్తకాలు......మాధవయ్య కోపంగా వున్నాడు. వెంకడు దూరంనుండి మెల్లగా ప్రవేశిస్తాడు.

మాధ– ఏంరా వెంకడూ!

వెంక– అయ్యా!

మాధ– వాడు కనిపించాడా?

వెంక– వస్తానన్నా రండి.

మాధ– ఆ దుర్గాం కొంప లోనే వున్నాడా...

వెంక– లేదండి... స్నేహితులతో మాట్లాడు తున్నారండి.

మాధ– అయితే వెంకడూ?

వెంక– అయ్యా!

మాధ– వూళ్లో ఏమనుకుంటున్నారా

వెంక– ......

మాధ– నన్ను గురించి...

వెంక– ఏమోనండి, నాకెట్టా తెలుసుద్దండి?

మాధ– నీకు తెలీకుండా వుంటుందా వెధవనాగన్నా. నీకొచ్చిన ప్రమాదం ఏంలేదు చెప్పు.

వెంక– సత్తెప్పమానంగా నాకు తెల్దండి.

మాధ– మన పాపయ్య మంచివాడే నంటావా?

వెంం– ఏమోనండీ.

మాధ– ప్రతిదీ ఏమోనంటావేరా... పాపయ్య సంగతి నీకు తెలియదూ!

వెంక– తెలుసండీ!

మాధ– మరి?

వెంక– అంత మంచివాడు కాదండి.

మాధ– పోనీ నీకు నమ్మకం వుందా మంచివాడని?

వెంక– లేదండీ, పాపయ్య వారి దొంగముండా కొడుకని, కొంపలు ముంచే రకమని అనుకుంటారండీ!

మాధ– ఎవరి కొంపలు ముంచాడంటావ్రా!

వెంక– నాకు తెలవదండి!

మాధ– పంతులు వ్రాళ్లో వున్నాడా...

వెంక– ఉన్నారండీ! యాడికో వెళ్లిపోతారుటండీ!

మాధ– ఎందుకు?

వెంక– ఆ విషయం నాకెలా తెలుసుద్ది చెప్పండి. ఆయనకేం కష్టం కలిగిందో యేమో.

మాధ– పంతుల్ని గురించి ఏమనుకుంటుంది లోకం...

వెంక- ఆయనకేమండీ మారాజు... పిల్లాజల్లా కలవోడు... యాడికెల్లిపోతాడో మరి...

మాధ- ఎక్కడికి వెళతాడట ?

వెంక- ఏమోనండి పట్టణం వెడతాడను కుంటాను.

మాధ- ఇంకా ఏమంటున్నాడు ?

వెంక- ఏమీా చెప్పడండీ ! ఈ మధ్య ఏదో దిగులుగావుంటున్నా రండీ 'ఎందుకండీ అట్టా వుంటున్నా' రంటే చెప్పడు. దిగులుతో మనిషి సగమై పొయ్యాడంటే నమ్మండి. మా మంచి మడిసండీ !

మాధ- పాపం ! వెళ్లిపోతున్నాడన్న మాట.

వెంక- ఏమోనండి, వూళ్లో గిట్టనివాళ్లు సానామంది వున్నారను కుంటున్నారు... ఏం చేస్తాడు. ఎక్కడో బతుకుతాడు వెళిపోయి.

మాధ- ఊఁ !

వెంక- నిజంగానండి మారాజు. ఎవరికేసాయం కావాలన్నా నిమి షాలమీాద చేత్తాడండీ...ఒకసారి ఏమైందనుకున్నారు...

మాధ- ఊఁ ఏదో అయిందిలే ఆ గొడవెందుకిప్పుడు.

వెంక- ఎందుకండీ అంతకోపం ...పోనీలెండి చెప్పను.

మాధ- ఎప్పుడు పోతాడట ?

వెంక- నాకు తెలవదండీ !

మాధ- కనుక్కో— పో నీ... బయటకువెళ్ళి యిబ్బంది పడతాడు పాపం.

వెంక- నిజమే నండి.

మాధ- అవును పాపం!

మాధ- వీడింకా రాలేదేం ఎక్కడున్నాడు?

వెంక- వస్తుంటారండి.

మాధ- మనవాడి సంగతి యేమిటి?

వెంక- ఇవ్వాళ యిట్టా అడుగుతున్నా రేంటండీ ... అందర్ని గురించి.

మాధ- మనవాడు పంతులుతో తిరుగు తున్నాడట నిజమేనా!

వెంక- లేదండీ!

మాధ- ఊఁ ఆ దుర్గాం యింటికి పోతున్నాడా!

వెంక- తెలవదండీ...నాకు తెలికడుగుతాను ... ఆడ చిన్న బ్బాయి గోరి కేంపనండీ!

మాధ- పంతులు మారిపోయాడట నిజమేనా?

వెంక- అనే అంటారండి.

మాధ- కూలీ నాలీ చేసుకునేవాళ్లని కుండగట్టుకున్నాడటగా.

వెంక- అట్టనాండి!

మాధ- వీడికి ఎంతకీబుద్ధి వొచ్చేట్టు కనపడ లేదు.

వెంక- వోరికండీ పంతులు గారికా?

మాధ- ఊఁ! ఏడిచావ్ నువ్వొక దొంగ వెధవ్వ ... అన్నిటికీ ఏమో ఏమో నంటావ్...మన ముకుందాయ్ పంతు

లుత్తో తిరగటం లేదూ? వాళ్ళిద్దరూ కలిసిచేసే ఆలో చనలు నీకు తెలీవూ? వీడు ఆ దుర్గాం కూతురుతో కులికే విషయం నీకు తెలియదూ? వూళ్లో నన్ను గురించి ఏమనుకుంటున్నారో నీకు తెలీదూ? అన్నీ తెలిసే వెధవ నాటకం ఆడతావ్... నా కళ్లల్లో కారం కొట్టా లని చూస్తున్నావ్ దరిద్రుడా...

వెంక- అయ్యగారు!

మాధ- ఛా! ముయ్ నోరు. డొక్క చీలుస్తాను అబద్ధంచెప్పా వంటే...

వెంక- అడిగో అబ్బాయిగోరు వొస్తుండారండి.

మాధ- ఫో అవతలకి... (వెళిపోతాడు)

కొంచెం ఆలస్యంగా ముకుందరావు వస్తాడు.

మాధ- దొరగారికి పొద్దూకులు తిరిగినా చాలటంలేదే?

ముకుం- (మాట్లాడడు)

మాధ- ఊళ్లో వ్యవహారాలన్నీ చక్కబెట్టటం అయిందా?

ముకుం- నాకేం వ్యవహారాలు లేవు చక్కబెట్టేందుకు.

మాధ- ఊఁ

ముకుం- పంతుల్ని బాకీ సుప్తాగా తీర్చమన్నావుటగా!

మాధ- ఏం, నీతో కంప్లెయింట్ చేశాడా?

ముకుం- ఊహుఁ చెప్పాకు ఏడ్చాడు.

మాధ- చావక పొయ్యాడూ? ఆ ఏడుపు నా దగ్గర ఏడిస్తే...అంత దాకా తెచ్చుకుంది తనేగా... మొదటేవుంటే ఈబుద్ధి...

ముకుం— ఏం తప్పుచేశాడని ?

మాధ— అది చెప్పలా మరి ఏడ్చినవాడు.

ముకుం— మీ నేవు వుండననటమేగా అతను చేసిన ద్రోహం. అంతకన్న మీకు కేమైనా ద్రోహంచేశాడా ? వ్యతిరేక ప్రచారంచేశాడా... లేదే! అయినప్పుడు మీరు అతని మీద కత్తిగట్టటం ఏం భావ్యం ?...

మాధ— నాకు తెలుసు భావ్యం, అభావ్యం అవునో కాదో... నేను అడిగితే ఏమన్నాడు. తన ఆశయాలకు వ్యతిరేకంట. గాడిది ఆశయాలు...వీడున్నూ !

ముకుం— నాన్నా ! మనిషన్నవాడికి, చీము నెత్తురు వున్నవాడికి మీకు చేసేపని నచ్చదు తెలుసునా. ఆ పాపయ్యలాంటి కాలసర్పాన్ని పాలుపోసి పెంచుతుంటే మీ దగ్గరకు ఎవరు రాగలుగుతారు. ఆ పంతులుగాదు, నాకుమాత్రం నేను సహాయంచెయ్యను. తెలివిగలవాడుగనక పంతులు ఒక్కమాటలో తన ఆశయాలకు వ్యతిరేకమని తప్పుకున్నాడు.

మాధ— ఏమిట్రా వీడి ఆశయాలు... ఈ వెధవకున్నూడా ఆశయాలు...వీడిదౌర్జన్యాలు, దురంతాలు సాగనియ్యాలా!

ముకుం— అవుపిస్తోనేవుంది ఎవరు దౌర్జన్యాలు, దురంతాలు సాగనిస్తోందిన్నీ...అతను ఏమయితే మీ కెందుకు. మీకు ఏమీ అపకారంచెయ్యనప్పుడు అతను ఏయిష్టయినా ఫరవాలేదు. మీదోవకు అతను అడ్డొచ్చాడా ! లేదు. మీ మీద వ్యతిరేకంగా ప్రచారంచేశాడా? లేదు. కాన

ప్పుడు మీరింత పగబూనటం నాకేం భావ్యంగా అవు
పించటం లేదు.

మాధ- వాడి పిచ్చి నీకూ తలకెక్కినట్లుంది.

ముకుం- నాకుగాదు. బుద్ధివున్న ఏమనిషికైనా ఎక్కుతుంది.
ఆలోచనవున్న ప్రతివ్యక్తికీ తెలుసు పంతులు అన్యాయం
చేస్తోంది మీరు అన్యాయానికి దిగిందీ!

మాధ- నీ కంటికి నేను అన్యాయపరుణ్నయా నన్నమాట.
బావుంది. ముప్పొద్దులా తిని, ఊరిమీదపడి గాలింపు
గంగలా తిరిగొస్తూ నువ్వు నేర్చుకున్న పాఠం యిదన్న
మాట. ఇదంతాకూడా పంతులు ప్రభావమేగా!

ముకుం- పంతులు! కళ్లుండి చూచేవాడికి తెలుస్తుంది.

మాధ- ఏమిటోయ్ తెలిసేది మహానీలుగుడుగా మాట్లాడుతు
న్నావ్.

ముకుం- ఆలోచించి అంటే బావుంటుంది. తొందరపడి అంటే
తర్వాత యిబ్బంది పడవలసి వస్తుంది.

మాధ- ఏడ్చినట్లేవున్నాయి నీ నీతులు.

ముకుం- ఇప్పటికైనా మించిపోయింది లేదునాన్నా. ఆ పంతుల్ని
పిలిచి ఏదో ఒకవిధంగా సరిపెట్టుకోండి బావుంటుంది.

మాధ- ఏమిటి సరిపెట్టుకునేది?

ముకుం- మీకు తెలుసు. అయినా చెప్పవలసిన పనిలేదు...నా
సలహా పాపయ్య పాపపు సలహాలకేం తీసిపోదు.

మాధ- ఇంకేమైనా వున్నాయా ఇంతేనా!

ముకుం— అవుసరంవొస్తే యింకా వుంటాయి.

మాధ— నీతో ఎప్పుడో చెప్పాను ఆ పంతులుతో తిరగటం మానుకోమని. ఇలాంటివి వొస్తాయని నాకు తెలుసు.

ముకుం— ఇప్పుడే మొచ్చింది.

మాధ— ఏంరా లేదు ? లోకులు అనేకమాటలంటున్నారు. పంతులుకూ, నాకూ నిప్పులో ఉప్పేసినట్లు వున్నప్పుడు నువ్వు వాడితో తిరగటం ఏం బాగాలేదు.

ముకుం— మీకు బావుండకపోవచ్చు. అందుకని నేను పంతులికి విరోధిని కావటం ఎందుకు? నాకు నచ్చినప్పుడు నే చెయ్యొచ్చుగా...

మాధ— ఇంతకీ నువ్వనేదేమిట్రా !

ముకుం— మీరనేదే కొంచెం తేడాగా నేనూ అంటున్నాను.

మాధ— పంతులుతో స్నేహం మానుకోనంటావా ?

ముకుం— అందువల్ల తప్పులేనప్పుడు ఎందుకు మానుకోవాలి అంటాను !

మాధ— నే చెబుతున్నాగనక...

ముకుం— అందుకే వీల్లేదంటున్నాను. నే చేసేపని నా యిష్టంమీద ఆధారపడి వుంటుందిగానీ మీ యిష్టంమీద కాదుగా. ఈ విషయంలోమాత్రం నన్ను క్షమించండి.

మాధ— చెట్టు చెడుకాలానికి కుక్కమూతి పిందెలు వేస్తుందని వూరికే అన్నారా ! నీకు పోయేకాలం వచ్చిందిగనుకనే ఈ విపరీతబుద్ధులు పుడుతున్నాయి.

ముకుం- అనునవును...

మాధ- సరేగాని మన గోపాలరావును ఎరుగుదువుగా!

ముకుం- మీ స్నేహితుడు గోపాలరావేనా?

మాధ- ఆc ఆయన కూతురు తెలుసనుకుంటాను!

ముకుం- తెలుసు తెలుసు ఎందుకు తెలియదూ.

మాధ- నీకు పెళ్లి చెయ్యాలనుకున్నాం.

ముకుం- ఆ సుశీల నిచ్చా?

మాధ- అవును.

ముకుం- నా కిష్టం లేదు. అయినా నేనిప్పుడు చేసుకోదలచ లేదు.

మాధ- ఎందుకనో?

ముకుం- యిష్టం లేక ...

మాధ- యిష్టం లేకనా లేక దుర్గాం కూతురు వొద్దన్నదనా?

ముకుం- ఆ విషయం మీ కనవసరం ... ఆ అమ్మాయి చాలా మంచిది.

మాధ- అవును. అయిన వాడికీ కానివాడికీ కనికరం చూపుతుంది.

ముకుం- నాన్నా! మీ రనుకున్నట్లు ఆమె చెడిపోయిందేం గాదు. ఈ పతివ్రతలని చెప్పుకునేవారి కన్న చాల మంచిది, మంచి స్నేహితురాలు...

మాధ- ఆడదానితో స్నేహం ఏమిట్రా నీకు?

ముకుం- మగాళ్లతో స్నేహంచేసి నాశనం కావటంకన్న సహృదయంగల స్త్రీలతో స్నేహంచేసి బాగుపడటం మంచిది.

మాధ– దాని వలలో బాగా పడిపోయ్యావ్ .

ముకుం– మీరు పాపయ్య వలలో పడ్డట్లు .

మాధ– నాకూ నీకూ సాపత్యం ఏమిటి ?

ముకుం– కాక మరెవరితో సాపత్యం కుదురుతుంది. దేనికైనా ఉజ్జీ కావాలిగా...

మాధ– చివరి సారిగా చెబుతున్నాను ... యింక నువ్వు దాని కొంప కెళటానికి వీల్లేదు .

ముకుం– వెళితే !

మాధ– ఏం జరగాలో అదే జరుగుతుంది .

ముకుం– అదే జరగదు జరగటానికి వీల్లేదు . నా బొందిలో ప్రాణం వుండగా మీా రనుకున్న ప్లానులు సాగవు. దౌర్జన్యాన్ని అరికట్టలేని ముకుందరావు నీ కొడుకేకాడు.

మాధ– నే చేసేది దౌర్జన్యమున్నా, నువు దాన్ని అరికట్టడమూ!

ముకుం– అవును పంతులు స్నేహం వనజ స్నేహం మానుకో మనటం దౌర్జన్యం కాక ఏమిటి !

మాధ– మన గౌరవ ప్రతిష్టలకు భంగం కనక

ముకుం– గౌరవమూ, ప్రతిష్ట అంటూ వుంటే ఈ మాత్రం చిన్న పనులకే భంగపడవు .

మాధ– ఈ విధవ పనులు చేసి సంఘాన్ని ఉద్ధరిస్తానన్న మాట. అదంతా వృత్తది. కలలో గూడా అలా జరగదు .

ముకుం– నేనేం ఉద్ధరిస్తాను సంఘాన్ని. మీా లాంటి గొప్పవాళ్ళు ఉద్ధరించాలిగాని !

మాధ- ఆ పంతులుకు పట్టిన పిచ్చి నీకూ పట్టింది. కొంపదీసి ఎర్రజండా పట్టలేదుగదా నువ్వానూ!

ముకుం- మొదట లేదు, ఇప్పుడు మీరందరూ కలసి చేయిస్తున్నారు నా చేత.

మాధ- మేం చేయిస్తున్నామా! ఇదేం చోద్యం.

ముకుం- మీరీ అన్యాయాలు, అక్రమాలు చేస్తోంటే చూచి సహించలేక ఎదిరించ వలసి వస్తోంది. పంతులికి న్యాయం కలగ జేయటం కోసం అన్యాయాన్ని ఎదిరించ వలసి వచ్చింది. మీరు వనజ యింటికి వొద్దు అనటం వల్ల వెళ్ళాలని బుద్ధి కలిగింది. మీరే ఆమాటలనకండా వుంటే అలా చేసేవాణ్ణి గాదు. ఈ బుద్ధి కలిగేదీ కాదు.

మాధ- ఎప్పణ్ణించి బాబూ ఈ మెట్టవేదాంతం.

ముకుం- తమకు కలిగినప్పటి నుండే.

మాధ- (గదిలో పటాలు, పుస్తకాలు చూపి) ఈ హంగామా అంతా చూచి అప్పుడే అనుమానించాను.

ముకుం- పటాల్లో, పుస్తకాల్లో ఏముంది హృదయంలో వుంది గాని, అయినా మీ కంత అనుమానం ఎందుకు నన్నడిగితే చెప్పే వాణ్నిగా వున్నది వున్నట్లు. నిజం నిప్పులాంటిది దాచి పెడితే దాగుతుందా. ఎప్పటికైనా రగుల్కొంటుంది.

మాధ- అంత తెగింపు కూడానా!

ముకుం- నిజం చెప్పటంగూడా తెగింపే... నాకు తెలియదండి. ఒకవేళ మీ భాషలో అలా అంటారేమో!

మాధ– ఇది నా యిల్లురా అబ్బాయి, ఈ యింట్లో నా యిష్టం వొచ్చినట్లుగా జరగాలి...నీవ్యవహారం అంతా మానుకో దల్చుకుంటే ఈ యింట్లో వుండు లేక పోతే.

ముకుం– ఉడాయించ మంటారు... అంతేగా మీారనేది.

మాధ– అవును. నా యింట్లో నీ లాంటి వాళ్ళకు స్థానం లేదు. రౌడీలు ముఠాకోర్లు వుండే యిల్లుగాదిది.

ముకుం– నేను నువ్వూహించినట్లు రౌడీని, ముఠాకోరును కాదు నాన్నా. ఏమైనా అన్యాయాన్ని న్యాయంతో తుడిచి వెయ్యాలి అనేవాళ్లు, చక్రవర్తి అయినా అన్యాయం చేస్తే సహించలేని వాళ్లు, ముష్టెత్తుకునే బిచ్చగాడి దగ్గర్నుండి చక్రవర్తి వరకూ న్యాయం జరగాలి అనేవాళ్ళు ఏ తెగకి చెందుతారో ఆ తెగనాది. అన్యాయాన్ని ఖండించటం మా మతం.

మాధ– నీ వేదాంతం నాకేం అవసరం లేదు...యిష్టం వుందా ఈ వ్యవహారాలన్నీ మానుకుని గుట్టుగావుండు లేకపో తుందీ బయటకు నడువు...

ముకుం– మీా గుట్టు బయట పడుతుందేమోనని మీా భయం

మాధ– మరేం ఫర్వాలేదు.

(ముకుందరావు లోపలికి వెడతాడు)

మాధ– అరేయ్ వెంకడూ! వెంకడూ!

వెంక– వొస్తున్నానండీ.

మాధ– ఎక్కడ చచ్చావురా...సమయానికుండవ్?

వెంక– అబ్బాయిగోరూ!

మాధ- వెధవా పోయి ఆ గోపాలరావుని, పాపయ్యని నే పిలుస్తున్నానని చెప్పి పిలుచుకురా...

వెంక- అదిగోనండి పాపయ్య వొస్తుండాడు.

మాధ- సరే పోయి గోపాలరావును కేకవేసిరా.

(వెంకడు వెళతాడు)

పాప- ఏమిటో హడావిడిగా వున్నారే!

మాధ- ఆఁ ఏం లేదు. నీకోసమే కబురంపుతున్నాను... ఇంతలో నువ్వేవచ్చావ్...రా కూర్చో... నిలబడే వున్నావేఁ!

పాప- ఈ గదికి కొత్త అందం వచ్చిందే...ఈ పటాలు, వ్యవహారం ఏమిటంటోయ్...

మాధ- మా వెధవ చేసినపని.

పాప- మనలాంటి మర్యాదస్తుల యిళ్లలో వుండకూడదండీ దేశద్రోహులవద్ద వుండాల్సినవి యివి

మాధ- కనకనే వున్నాయనుకోరాదూ!

పాప- ఏమిటి హాస్యంగా మాట్లాడుతున్నారే.

మాధ- నిజం పాపయ్యా! మావాడు పంతులు వలలో పడటమే కాకండా పూర్తిగా మారిపొయ్యాడు.

పాప- నే నమ్మను...

మాధ- నేనూ నమ్మలేదయ్యా పాపయ్యా... నిక్కచ్చిగా చెప్పాడు నేను ఫలానా మీరుచేసేదేమిటో చేసుకోండి అని... ఇప్పటికైనా నమ్మావా?

పాప- మా చెడ్డ ప్రమాదమే!

మాధ- మరేమీ ప్రమాదంలేదు. ఈవేళనుండి వాడి దోవవాడిది నా దోవనాది.

పాప- అదికాదండి నేననేది. అతనివల్ల మీకూ ప్రమాదం రావొచ్చు. అది ఎలా తప్పించుకోటమా అని ఆలోచిస్తున్నాను.

మాధ- మనకు ప్రమాదం ఏమిటయ్యా... నిప్పుకు దూరంగా వుంటే కాలుతుందనే భయం ఎందుకుంటుంది...?

పాప- అని ప్రభుత్వం అనుకుంటుందా... మీరు మీరంతా వొకటేనని అనుకుంటుందిగాని.

మాధ- వీడిమూలంగా నాకు చచ్చేరోజు వచ్చింది...

పాప- అదే నేనూ అనటం. ఇవాళగాకపోతే రేపైనా ప్రభుత్వం ఈ చీడపురుగుల్ని ఏరివెయ్యకపోదు. అప్పుడు అయిన వాళ్లనూ, కానివాళ్ళనూ అరెస్టుచేస్తారు. ఫలానా అతని తండ్రి అంటే ఆ ప్రమాదం మీవరకూ రావటానికి అవకాశంవుంది చూడండి.

మాధ- ఉన్నదంటారా ?

పాప- తప్పకండా. అందులో సంశయంకూడానా. ఎందుకైనా మంచిది ఈ సరంజామా అంతా తీసేయించండి.

ముకుం- (వొస్తాడు) మీకు ఆ శ్రమ అవసరంలేదు నేనే తీసుకుంటాను. అవి మీచేతులు తాకితే అపవిత్రం అవుతాయి తాకకండి.

పాప- వారెహ్వా ! ఎంతలో ఎంతగా మారిపొయ్యాడు.

ముకుందరావు పటాలు, పుస్తకాలు తీసుకుని వెళ్లి
పోతాడు. అతను వెళిపోయ్యేవరకు ఎవరూ మాట్లాడరు.

పాప– అయినా మరొకమారు చెప్పిచూడకపోయ్యారా ?

ముకుం– అయినాయిబాబూ, అన్ని చెప్పటాలు అయినాయి. నెత్తిన నోరుపెట్టుకుచెప్పాను. ప్రయోజనంలేకపోయింది.

పాప– అలాగంటే ఎట్లా చెప్పండి. లాలించి, బెల్లించి మనస్సును మార్చడానికి ప్రయత్నించాలిగాని అయినవాళ్ళను కాలరాసుకుంటామా. . .

మాధ– పోనీ నువ్వు చెప్పిచూడు వొకసారి.

పాప– నేనా! నామాట లెఖ్ఖా–పత్రమా చెప్పండి. పంతులు వ్యవహారం అంతా నేనే చేయిస్తున్నానని అనుమానపడి ఛస్తున్నారు. అలాంటప్పుడు ప్రయత్నించీ మాటపోగొట్టు కోవటంతప్ప ఏంలేదు.

గోపా– (వస్తాడు) ఏమండోయ్ బావగారు ఏమిటి కబుర్లు ఎదో అర్జంటుగా రమ్మని కబురుచేశారుట.

మాధ– అవునయ్యా గోపాలం. ఒకవిషయంలో మాలోమాకు తలలు కుదరక నీ సలహా కావలసివచ్చింది.

గోపా– ఏమిటండీ అది.

మాధ– ఆఁ ఏముంది. మనవాడు లేడూ, మీ అల్లుడు బైరాగుల్లో కలుస్తున్నాడుగా.

గోపా– బైరాగుల్లో కలుస్తున్నాడు. ఎవరూ ?. . .ఎందుకు ?

మాధ– ఎవరోఅయితే నాకీ తొందరెందుకు. మా ముకుందాయ్ ఆ విప్లవముఠాలో కలిసిపోతున్నాడుగా.

గోపా- నిజంగానా... తెలివిగలపనిచేశాడు.

మాధ- అదేమిటి గోపాలరావ్ చెడిపోవడంగూడ తెలివిగలపనే!

గోపా- మనిషి రాజకీయంగా మారటంఅంటే తెలివిగా చెడిపోవటమన్నమాట. ఆఁ ఇంతకీ ఎక్కడ మనవాడు?

మాధ- లోపల వున్నట్లున్నాడు.

గోపా- నేను ఎప్పుడో అనుకున్నాను. ఉండి ఉండి ఎప్పుడో పుటిక్కన యింతపనీ చేస్తాడని!

మాధ- మా చాతనైనంతవరకూ చెప్పాం వినలేదు. ఇక నీవంతు వుంది...ఇవి చేతులుకాదు కాళ్ళుఅనుకుని వాణ్ణి ఎలాగైనా ఒక దోవకు తీసుకురా.

గోపా- మీవల్లకానిపని నావల్లమాత్రం అవుతుందంటారా. ఈరోజుల్లో కుర్రాళ్లు మనమాట వింటారా? ఏమో బాబూ నాకు నమ్మకంలేదు.

గోపాలం ప్రవేశంతో వెళ్ళిపోయిన పాపయ్య తిరిగివస్తాడు.

మాధ- అయినా ప్రయత్నించు. కాకపోతే మనంచేసేది లేదు.

పాప- చేసేదేదో చేద్దాం తర్వాత.

మాధ- పద పాపయ్యా మనమెందుకు మధ్య (యిద్దరూ వెళతారు)

గోపా- అబ్బాయ్ ముకుందరావ్.

ముకుం- (లోపలనుండి వస్తో) ఎవరూ మీరా!

గోపా- నేనేగాని ఏమిట్రా ఈపని.

ముకుం- ఏముంది ఏమీలేదు.

గోపా- ఏమీలేదని నువ్వంటే సరిపోయిందా. నలుగురూ ఏమంటారోనని యోచించావా !

ముకుం- ఆలోచించబట్టే యిలా జరిగిందనుకోండి. నన్ను మందలించాలని ప్రయత్నించకపోతే నాన్నకే చెప్పరాదూ ఆ తప్పుడుపనులు మానుకోమని.

గోపా- మనకంటే పెద్దవాడు. తనేంచేసినా నీ మేలుకోరి చేస్తాడు గదా...ఆయనకుమాత్రం ఏ పదిమందివున్నారుగనక. కొడుకునైనా, కూతురునైనా నీవేగదా. కళ్లలోపెట్టుకుని పెంచుకున్నాడు. తీరా చేతికి అక్కరకు వచ్చే రోజుకు నువ్వు యిలా ఆయనకు కాకండాపోవటం నాకేం బాగాలేదు.

ముకుం- అదిగాదు మావయ్యా !

గోపా- అదిగాదు, ఇదిగాదు, ఏమిటి నీతలకాయ. కుర్రతనం, కుర్రతనపుచేష్టలు. పెద్దవాళ్లు చెప్పినట్లు నడుచుకోవద్దూ. వూళ్లో శాస్త్ర చదువుకున్నవాడవు, మర్యాద మన్ననా తెలిసినవాడవు అనుకుంటే యిలా చేస్తావా.

గోపా- నువ్వు, నువ్వు, నువ్వు అంటావుగానీ నే చేసినతప్పేమిటో చెప్పవేం ?

గోపా- పెద్దవాళ్ల వ్యవహారాలలో జోక్యంకలిగించుకోవటమే పెద్దతప్పు. వాళ్లపని వాళ్లు చూచుకుంటారుగా నీకెందుకు.

ముకుం- అన్యాయం జరుగుతూవుంటే చూస్తూ ఎలావూరుకునేది. పంతులంటే ఈయనకెందుకంతకోపం, కసి. నిజంగా పంతులు బాకీవుంటే వుండొచ్చు. చేబదులుగా తీసుకున్న

దానికి యింత రాద్ధాంతంచేయటం న్యాయమేనా...
నించున్న పాళాన అతనుమాత్రం ఎక్కడ తెచ్చి కడతాడు.

గోపా- ఆ గొడవలేవో నీ కెందుకురా కుర్రాడివి. నిజం మాట్లా
డితే నిష్టూరంగాని నీ కనవసరంగదా ఆ విషయాలు.

ముకుం- ఆ పంతులు లబోదిబో మని ఏడ్చాడు. ఇంటిల్లపాదీ
హాలో లక్ష్మణాఅంటూ, ఆలుబిడ్డలతో సహా మాజీవాన
పడి ఏడుస్తారే...ఇంతకాలం బాగాబ్రతికి యిప్పుడు ఒక
వ్యక్తిమూలంగా పతనమైపోతున్నాడంటే ఎట్లా సహిం
చటం.

గోపా- కుర్రవాడివిరా నువ్వింకా. ప్రపంచానుభవం తక్కువ.
ఎవడు ఏడిస్తే నీ కెందుకు, ఎవడు కులికితే నీ కెందుకు నీ
చదువేదో నువ్వు చూచుకోక.

ముకుం- నాన్నకు పట్టిన పిచ్చి నీకూ పట్టింది.

గోపా- అదే పనికిరాదురా... పెద్దలను విమర్శించకూడదు
నువ్వెంత చదువుకున్న వాడివైనా.

ముకుం- పెద్దవాళ్ళని చేసే తప్పుడు పనులన్నీ చూస్తూ వూరుకోవా
లంటారా! అలా వూరుకో లేనివాడు, నాలాంటి వాడు
ఎవడైనా వుండి న్యాయానికి నిలబడితే ఏమౌతుంది.

గోపా- నానా అగచాట్లు పడవలసి వస్తుంది.

ముకుం- అందుకు సిద్ధపడితే

గోపా- నే చెప్పలేను నాయనా ... చదువుకున్నందుకు నీకూ
ఆ పిచ్చెక్కింది. ఆ కోవలో వా డెవడూ బాగుపడగా
నే చూడలేదు.

ముకుం– బాగుపడి అన్యాయాలకి దిగేకన్న చెడిపోయి న్యాయంగా బ్రతుకుతాను. ఎవరి కొంపలు ఆర్పకండా, ఎవరి ఉసురు పోసుకోకుండా నిప్పచీగా కాలక్షేపం చేస్తాను సరేనా!

గోపా– నీ యిష్టం వచ్చినట్లు వూరేగు. ఏదో పెద్దవాణ్ని గనక చెప్పాను వినకపోతావూ నీ కర్మ నువ్వే అనుభవిస్తావు.

ముకుం– ఈ కర్మలతో పాపపుణ్యాలతో నాకేం నిమిత్తంలేదు... వాటిమీాద నమ్మకంగూడా బొత్తిగాలేదు.

గోపా– అవునవును. అవుపిస్తోనేవుంది వేరే చెప్పాలా! ఆ లక్షణాలున్నాయి చూచావూ చెప్పకండానే అవుపిస్తాయి బాబూ... సరే నే వెళతాను...

ముకుం– చాలా మంచిది.

వెంక– (ప్రవేశించి) ఏటండీ ఆ గోపాలం గోరనేది. నాకు బాగా తెలిసి చావలేదు.

ముకుం– ఆయనగారు నీతులు గరపమని పంపితే ఈయనగారు నయబోధ చేయడానికి వచ్చారు.

వెంక– ఆ మాటమాత్రం నిజం అబ్బాయిగోరు ... మీారు ఏం చేసినా నా కిష్టమేగానీ ఉద్రటవుడియంగా యిట్టా ఎల్లి పోవటం నాకేం బాగులేదు.

ముకుం– నాన్న నిన్నుగూడా పంపాడా యేం ఈ మాట చెప్ప మని. ఈ నీతులు చెప్పే వాళ్లందరూ వెనక గోతులు తొవ్వేవారే... వొఠి దొంగలు. తమకు ఆచరించటం

చాతగాక యితరులకు బోధిస్తారు. అదే వీళ్లలో వున్న దుర్గుణం.

వెంక— నే నలాంటివాణ్ని కానండీ అబ్బాయిగోరూ. నా సంగతి మీకు తెలుసుగా... మిమ్మల్ని ఎట్టా సాకానో యేమిటో ఈ చేతుల్ని అడిగితే సాక్షం చెబుతాయి.

ముకుం— కనక?

వెంక— కనక నే నండి పోవద్దని బతిమలాట్టం. పెద్దయ్యగారు నాకేం చెప్పలేదండీ, ఆపాపంకూడా ఎందుకు... నాకు తోచినముక్క చెప్పాను. మీకు తెలీదు గానీండి పిన్న తనం. ఇట్లా యిల్లు వొదిలిపెట్టి బెదిరించిపోయి సాధిం చిన వాళ్లను నా జల్మలో నే నెరగనండీ! ఏమైనాసరే యింటోనే వుండాలా. అనుకున్న దేదో సెయ్యాల. అదే పద్ధతి.

ముకుం— నీ యిష్టప్రకారం సన్యాసం నడుచుకోమంటావ్... అదేగా నువ్వనేది. నీకు మంచి అని ఏదితోస్తుందో అదే నాకూ మంచి అవుతుందా.

వెంక— చేసుకోవాల అబ్బాయిగారూ చేసుకోవాల. కుర్రతనం గనక అనేక ఆలోచనలు, అనేక బుద్ధులు కలుగుతాయి. వాటిని ఆచరించగలవా!

ముకుం— సాధ్యమైనంతవరకు ప్రయత్నిస్తాం వెంకన్నా... ఇందులో చెడిపొయ్యేది లేదుగా. భయపడాల్సినపనీ లేదు. అందరూ చెడిపోతున్నానని అనుకుంటారూ అనుకోనీ...

వెంక— అది సరేనండి అయితే తమకు మకాం ఎత్తేస్తారన్నమాట.

ముకుం- ఇదో వెడుతున్నాగా !

వెంక- పెట్టె, పుస్తకాలు, బట్టలు.

ముకుం- అవేవీ నావిగాదు వెంకన్నా. నాన్న పంపినడబ్బుతో కొన్నాను. అవి ఆయనవే అవుతాయిగాని నావి కావు.

వెంక- సన్యాసంపుచ్చుకుంటారేంటి !

ముకుం- అంత అదృష్టం యింకా పట్టేట్లు లేదు.

వెంక- నాకు తెలవదుటండీ మీరుమంచివారని. మీరు వుండ బొయ్యేది ఆ వనజమ్మ యింట్లోనేనాండి...వూరికే లెండి అడుగుతున్నా. ఎప్పుడన్నా వొస్తాను.

ముకుం- బహుశా అక్కడే... నువ్వెందుకు రావటం... నాన్న కోప్పడమూ !

వెంక- అయ్యగారి కెందుకు తెలుసుద్దండీ ! అప్పు డప్పుడు వొస్తుంటాను...సంగతులు తెలుస్తుంటాయి.

ముకుం- మాసంగతులా !

వెంక- కాదండీ యిక్కడి సంగతు లే...నేను ఎప్పుడు మీపక్షమే నండోయ్.

ముకుం- వస్తా వెంకడూ... పెద్దవాడివి... జ్ఞాపకంవుంచుకో...

వొంటరిగా ఆశగా వెళ్ళిపోతాడు.

# ఛాయా చిత్రణ

## ( SHADOW SKETCH )

పంతులు జీవితం ఒడుదుడుకులకు లోనయింది. వెలుగు నీడలలో గాక చీకటి గుయ్యారాలలో అతని బ్రతుకు బాటల నేర్పరచుకున్నది. మాధవయ్య అనవసరంగా పంతులుపై పగ బూని ఎలాగైనా సాధించ దలుచుకున్నాడు. అదే కారణంగా మాధవయ్య కొడుకు చదువు సంస్కారాలు గల ముకుందరావు పంతులు పక్షాన న్యాయం చేయడానికి పూనుకున్నాడు. ఇంటినుండి వెళ్లగొట్టబడ్డ ముకుందరావు ప్రయత్నాలు యింకా ఒకరూపంధరించలేదు. మాధవయ్య అండజూచుకుని పాపయ్య పగ సాధించ దలుచుకున్నాడు. ఎలాగైనా పంతుల్ని సూపు మాపాలని పాపయ్య వాంఛ. అందుకే అతని ప్రయత్నాలు.

వర్ణన: పంతులు ఊరిబయట నిర్జన ప్రదేశంలో ఏకాంతంగా కూర్చొని ఆలోచిస్తుంటాడు. అతని నీడబరువును, భారాన్ని, విచారాన్ని చూపుతూవుంది. చుట్టూచెట్లు సాగే నీడల్ని సారించుతున్నాయి. అది ప్రశాంత సమయం. గాలులు సంగీతాల్ని ధ్వనిస్తున్నాయి. పంతులు మనస్సులోని ఆవేదనను, చీకాకును సంగీతరుతాలు ధ్వనింప చేస్తుంటాయి. మంద్రంగా వున్న సంగీతం క్రమేణ భయానకంగా మారుతుంది. ఒక్కసారిగా చీకటి ఆవరించి తిరిగి వెలుగులో అతని నీడ అవుపిస్తుంది. పాపయ్య, అతని అనుచరులు లాఠీ కర్రలతో ప్రవేశిస్తారు. పంతులు వెనకగా రహస్యంగా, నెమ్మదిగా భయంక

రమైన అడుగులతో — భయానక సంగీతం హెచ్చుస్థాయిలోకి పోతుంది. పంతులు తలమీద కర్ర బలంగా తగులుతుంది. పెద్ద కేక మూలుగు ధ్వని ...... పాపయ్య అనుచరులతో అదృశ్యుడవుతాడు.

పాపయ్య పోలీసులతో సంప్రదిస్తాడు పోలీసుఉద్యోగికి లంచం పెట్టి ఒప్పించి మొత్తంమీద పంతుల్ని అరెస్టు చేసే ప్రయత్నం చేస్తాడు. తలమీద తగిలిన గాయంతో పంతులు బాధగా, విచారంగా నడుస్తూవుంటే పోలీసులవిజిల్స్ చుట్టు ముట్టుతాయి. చివరకు పంతులు అరెస్టు చెయ్య బడ్డాడు. జైలుగోడలమధ్య కటకటాలకు అవలగాఅగుపిస్తాడు పంతులు. పాపయ్య నీడ అతన్ని సాలోకించి ముందుకు నడచిపోతుంది. మంద్రంగా రంగం చీకటి అవుతుంది.

ఇది ఛాయా చిత్రణ. మూంగగా నడుస్తుంది. సంభాషనలు అవసరం లేదు. సంగీతం ప్రేక్షకుల హృదయాలను సన్నివేశాను గుణ్యంగా కలచివేస్తుంది. కాలహరణం ఎక్కువగా జరగటం మంచిది. పదిపదిహేను నిముషాల వరకు ఈ చిత్రణకు అవకాశం వుండాలి.

—నాల్గవరంగం ప్రారంభం అయ్యేవరకు
సన్నని చిక్కని సంగీత స్వరాలు—

# నాల్గవ రంగము

వనజయిల్లు: ముకుందరావు, వనజ విచారంగా కూచునివుంటారు
ఆ యిద్దరే గదిలో...ఒకరికిమరొకరు సాయం జీవితంలో సైతం
పరస్పరం మనస్తత్వాలు అర్థంచేసుకున్న వ్యక్తులు వారు...
పరిస్థితులు అయోమయంగా, అర్థంగాకుండా వున్నాయి.

వనజ– ఇంకా యేమిటి ఆలోచిస్తున్నారు ?

ముకుందరావు మాట్లాడడు. తలెత్తిచూచి తిరిగి ఆలోచనలోకి వస్తాడు.

వనజ– అన్యాయం జరిగింది...అనుకున్నంతా అయింది.

ముకుం– ఇంతకష్టపడీ ఫలితం లేకపోయింది. మనవల్ల సహాయం పొందలేకపోయాడు పాపం పంతులు ! ఏంచేస్తాం !

వనజ– ఎందుకు అరెస్టుచేశారని మీ ఉద్దేశం.

ముకుం– కారణం లేదు. అనుమానంమీద అరెస్టుచేసివుంటారు. అరెస్టుచెయ్యటానికి ఒకపద్ధతి, న్యాయం అంటూ లేవు. రేపు నిన్ను, నన్నుకూడా చెయ్యొచ్చు... ఎవరు చూచారుగనక.

వనజ– ఇద్దర్నీ చేస్తే చిక్కేలేదు. ఒకర్ని చేసి ఒకర్ని వొదిలేస్తే కష్టంగానీ !

ముకుం– అలా ఎందుకుజరగ్గూడదు... అశుభంశుభం తెలియని పంతుల్ని అరెస్టుచెయ్యగా లేనిది నిన్ను, నన్ను చెయ్యటంలో అన్యాయం, అక్రమం ఏముంటుంది. లోకానికి తెలుసుగదా మనం ఫలానా అని.

వనజ– అలాంటప్పుడు మిమ్మల్ని ఆదుకునేవారన్నా వున్నారు. పాపం! పంతులు కుటుంబంసంగతి, ఆ తల్లి పిల్లలు ఎంతగా అల్లాడుతున్నారో!

ముకుం– మరేందిగుల్లేదు. ఊరివారికి వారిమీద సానుభూతి కలక్కపోదు. పంతులు తిరిగివచ్చేవరకు పోషిస్తారు. అసలు కావలసినవ్యక్తి లేనప్పుడు వీళ్ల కోపతాపాలు యింకెవరిమీద!

వనజ– పంతులును ఎప్పుడు వొదులుతారో!

ముకుం– ఈ హడావుడి తగ్గిన తర్వాత.
ఎవరక్కడ? ఎవరో వచ్చినట్టున్నారు.

వనజ– ఎవరూ! ఓ నువ్వా వెంకన్నా రా లోపలికి!

వెంక– (విచారంగా వస్తాడు)

వనజ– అలావున్నావేం వెంకన్నా... అయ్యగారు కోప్పడ్డారా!

వెంక– (లేదన్నట్లు తలూపుతాడు)

వనజ– మరెందుకు నీకీ విచారం.

వెంక– పాపం పంతులుగార్ని తలపగలకొట్టారుటగదండీ!

వనజ– ఎవరన్నారు?

వెంక– అంతా సెప్పుకుంటున్నారుగదండమ్మా...

వనజ– దొంగవెధవలు, గిట్టనివాళ్ళు చేసివుంటారు... లేకపోతే ఎవరు చేస్తారు.

వెంక– కాదండీ!

ముకుం– గిట్టనివాళ్ళే చేసి వుంటారు...

వెంక– పాపయ్య నిన్న బస్తీకెళ్ళారండీ !

వనజ– మీ అయ్యగారు పంపారా !

వెంక– ఆరికి తెల్దండీ. నెళ్ళి పాపయ్యను పిల్చుకు రమ్మంటే వెళ్ళాను. రాత్రే బస్తీకి వెళ్ళారని చెప్పారండి.

వనజ– అయితేమాత్రం వెంకన్నా మీ దొరగారికి యిదేం బుద్ధిరా. అనగూడదుగానీ పంతుల్ని యిట్టా అన్యాయం చెయ్యొచ్చా ఆయన పెళ్ళాం బిడ్డలెట్టా అల్లాడి పోతు న్నారో చూచావా !

వెంక– ఆయన గారికి తెల్దండీ అసలు. పొద్దున్న నేచెప్పే వరకు యిట్టా జరిగిందని ఎరగరండి. మొన్నట్నుండీ అయ్య గారికి జరంగా వుంటంండీ లేవలేదు. ఇయ్యాల పొద్దుట యిట్టాగని చెప్పేటప్పటికి చాలా యిచారించారండి.

వనజ– మొసలి కన్నీళ్ళు.

ముకుం– నాన్నకు జ్వరమా ! నాకు చెప్పలేదేంరా !

వెంక– మీతో చెప్పొద్దన్నారండి... ఇంతకుముందే అయ్య గారు పంతులింటికెళ్ళి పలకరించి వొచ్చారండి. పాపం ! ఏమాట కామాటగానీయండి. పంతులుగార్ని కొట్టి, అరెస్టు చేశారని తెలిసి జాలైపొయ్యారండి ... మా రాజు...... మంచిగుణం కలవోరండి.

ముకుం– ఆయన మంచివాడేకాని పట్టిన దయ్యాలు అలాంటివి.

వనజ– ఎవరు చేశారని మీ అభిప్రాయం.

వెంక– ఎవరుచేశారో తెలవదు కానీండమ్మా చేయించిందిమాత్రం

వనజ– ఎవరూ !

వెంక– పాపయ్యోని అనుమానం సానా మందికి.

వనజ– అంతే అయివుంటుంది.

వెంక– నిన్న సందకాణ్ణించి అయిపు ఆనవాలులేదు మడిసి పట్టణం సచ్చాచ్చట్ట. పట్టణమేఎల్లాడో కాటికేఎల్లాడో.

ముకుం– నాన్నకు ఎలావుంది వెంకన్నా.

వెంక– ఫరవాలేదండి. మొత్తానికి ఎదో దిగులుగా వుండారండి. మనిసి సాలా సిక్కి–పోయాడు. మీరు ఆ యింటిలోంచి అడుగీకట పెట్టారో లేదో పట్టుకుందండి దిగులు. వేలకి అన్నం తినరు, నిద్రపోరు... ఒకటే ఆలోచన...పిచ్చి.

వనజ– అంతానాటకం. లోకం అనుకుని పోతుందని అదొక తతంగం చేస్తున్నాడు.

వెంక– అమ్మాయిగారూ మీకు తెల్దండీ ఆరి సంగతి.

వనజ– అవున్లే. ఎవరివాళ్ళనువారు వెనక వేసుకు రాకపోతే బయటవారు మెచ్చుకోవద్దూ...ఆ యింటివాడివి నువ్వే మెచ్చుకోవాలిమరి ఆయనగారి ప్రతాపం.

(గోపాలరావు గొంతుక గాభరాగా వినిపిస్తుంది.)

ముకుందరావ్... ముకుందరావ్...

ముకుం– ఎవరూ !

గోపా– నేనేరా గోపాలరావుని.

వెంక– రండి బాబూ రండి. అబ్బాయిగారు లోన వున్నారు.

గోపా– ముకుందం... ఏం చేస్తున్నావురా.

ముకుం– ఏమీ చేయటం లేదు.

వనజ– అవుపిస్తోనే వుందిగా యింకా అడుగుతారేం.

వెంక– కాదండీ... పంతులుగారి యిసయం.

గోపా– ముకుందరావ్... యిట్లారా... ఒక్కమాట.

ముకుం– ఇక్కడ చెప్పు మావయ్యా... పరాయివాళ్ళు ఎవరు న్నారు గనక. అంతా అయినవాళ్ళేగా.

గోపా– ఒక్కసారి బయటకురద్దూ...అవసరమైనమాటచెప్పాలి.

వనజ– వద్దు పోకండి?

ముకుం– ఫరవాలేదు చెప్పండి.

గోపా– మన యింటిదాకా రావాలి ఒకసారి...తొరగా

ముకుం– ఎందుకు?

గోపా– తొరగా కదల్రా తర్వాత చెబుతాను కారణం.

వెంక– కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తానికి.

ముకుం– వెంకన్నా!

గోపా– తొరగా లేవరా బాబూ...ఆలస్యం చేస్తే ప్రమాదం.

వెంక– ప్రమాదం?

వనజ– ప్రమాదమే!

ముకుం– ఏమిటి ఆ హడావిడి...

గోపా– (గాభరాగా కిరిటీలోంచి బయటకుచూస్తుంటాడు) లేరా అబ్బాయ్...తర్వాత నీకే తెలుస్తుంది మాయింటికి రాక పోతే మానె ఎక్కడికన్నా పారిపో...

ముకుం- పారిపోవాలి ! . . . ఎక్కడికి ? ఎందుకు ?

వెంక- గోపాలంగారు మా గాభరా పడిసండీ !

గోపా- నీ మేలుగోరి చెబుతున్నాను. ఇప్పటికైనా మించి పోయింది లేదు కదులు. . .కదలరా అబ్బాయ్.

ముకుం- నాకేం అర్థం గావటం లేదు.

గోపా- పోలీసులు వొస్తున్నారట్రా నీకోసం.

ముకుం- నాకోసమా ! నేనేం దొంగతనం చెయ్యలేదే. ఎవరి తలలు పగలగొట్టించ లేదే . . . ఎవర్నీ అన్యాయంగా అరెస్టు చేయించ లేదే నన్నెందుకు పట్టుకుంటార్?

గోపా- కమ్యూనిస్టువి గనక . . . ఎవరో రిపోర్టు చేసి వుంటారు. . . బయల్దేరి వొస్తున్నారని తెలిసింది. నామాట విని ప్రాణాలైనా దక్కించుకో చిక్కితే చిత్రవధ చేస్తారు.

వెంక- అబ్బాయిగారూ మాయింటికి వెడదాంరండి. మిమ్మల్ని దాచి పెడతాను వోరికీ తెలవనీకండా.

వనజ- పారిపోండి. ప్రాణాలు దక్కించుకోండి.

ముకుం- పారిపోవటం పిరికితనం. అది ఎప్పటికీ జరగదు. జరగటానికి వీల్లేదుకూడా. దేవుడు దిగివచ్చినాయిక్కణ్ణించి కదల్ను.

గోపా- సరే నీయిష్టంబాబూ. ఇంత రణపెంకె అయితే లాభం లేదు. యుక్తాయుక్తాలు లేవు ఏం ప్రయోజనం చదివావు పెద్దచదువులు. ప్రాణాలమీద ప్రేమవుంటే తొరగా వెళ్ళిపోవటం మంచిది ఎక్కడికైనా. . . తర్వాత గోపాల రావు చెప్పాడు, నేనే వినలేదు అనుకుంటావ్.

ముకుం- అనుకోను. ఆవేశం నీ మీదికొస్తుందన్న భయం అనవసరం. ఎవర్నీ నిందించను, ఎవర్నీ అనుమానించను సరేనా. తమరు వెళ్ళిపోవచ్చు.

గోపాలరావు వెళ్ళిపోతాడు

కొద్ది క్షణాలు నిశ్శబ్దం. పోలీసు విజిల్సు ఒక్కసారిగా వినిపిస్తాయి. రెండువేపులనుండి పోలీసులు ముట్టడిస్తారు. వనజ నిశ్చేష్టురాలై పోతుంది. ఇనస్పెక్టరు, ఇద్దరు పోలీసులు లోపలకు వస్తారు.

ఇనస్పె- ముకుందరావు ఎవరిక్కడ?

ఎవరూ పలకరు

ఇనస్పె- ఏ రూ!

ముకుం- నేను...

వనజ- లేదు. ఆయన పారిపోయ్యారు.

వెంక- అవును వెళ్ళిపొయ్యాడు

ముకుం- నేను అని చెబుతున్నాను...ఎందుకు?

ఇనస్పె- అరెస్టు చేస్తున్నాం.

ముకుం- కారణం?

ఇనస్పె- కాగితంలోవుంది (కాగితం చేతికిస్తాడు)

ముకుం- (చదువుకుంటాడు) అని ఎవరు చెప్పారు?

ఇనస్పె- మీనాన్న...మాధవయ్య...అదిగో రిపోర్టు.

ముకుం- (కర్కశంగా) మాధవయ్య...నాన్న...అవును.

వెంక- అబద్ధం...ఆయనకేం తెలియదు.

ముకుం- వెంకడూ! వెళుతున్నాను. వస్తా వనజా! పదండిపోదాం

పోలీసులు చేతులకు బేడీలు తగిలించి తీసుకుపోతారు
వెనకగా ఇనస్పెక్టరు వెళతాడు. నిశ్శబ్దం.

వెంక— గోపాలంగారు పారిపొమ్మన్నప్పుడు పారిపోతే బాగుండేది.

వనజ— ఎక్కడున్నా పట్టుకుంటారు...వాళ్ళు పోలీసులు!

వెంక— అరెస్టు చేసినట్టేనాండి.

వనజ— ఆఁ!

వెంక— ఎందుకటండీ?

వనజ— మీ అయ్యగారు రిపోర్టు చేశారుట కొడుకు కమ్యూనిస్టని అరెస్టు చెయ్యమని.

వెంక— నిజంగా అయ్యగారు చేశారని నమ్ముతున్నారా...నాకు నమ్మకం లేదండి. ఆయనగారు అట్టా చెయ్యలేరండి.

వనజ— నీకు తెలియదు వెంకన్నా... ఆయనకు అసలే కసిగా వుంది చేస్తే చేసివుండవచ్చు...ఆయనకు కాకపోతేఎవరికి పట్టింది.

వెంక— అయ్యగారు చేయించిన పనిమాత్రం కాదండి. అంత వరకు ఖాయంగా చెప్పగలను.

వనజ— వెంకడూ... కొమ్మలు విరిగిన చెట్టులాగా అయ్యాను నేను. అటు సంతులు, ఇటు పీసు లేకుండా పొయ్యారు. నా అనుకునేవాళ్ళు లేకుండా పొయ్యారు... లోకంకళ్లు చల్లబడ్డాయి వెంకడూ!

వెంక— ఈ కార్పణ్యాలు, ద్వేషాలు ఈ మధ్య బాగా పెరిగి పొయ్యాయండీ! తగూలు కొట్లాటలు ఎక్కువైనాయి. ఆ పాపయ్యగార్ని అరెస్టు చేస్తే తీరిపోతుంది సగంపీడ.

వనజ— ఇదంతా పాపయ్య చేసిన మోసం కాదుగదా!

వెంక— ఆఁ అవునండీ అమ్మాయిగారు. దొరికాడుపో దొంగ... వీడి అంతు తేల్చుకుంటానుండండి.

(వెంకడు వెళ్ళిపోతాడు)

కొంచెం సేపు ఆలస్యం - తర్వాత పాపయ్య వస్తాడు
వెంకడు వెళ్ళినవైపునుంచే - వెనుకంగ మాస్టార్ ప్రవేశిస్తాడు

వనజ అతనివైపు చూడదు. అతను వొచ్చిన విషయమే
తెలియదు ఆమెకు. పాపయ్య చప్పుడు చేస్తాడు.

వనజ— ఎవరూ! ఓ... నువ్వా?

పాప— అవును నేనే... ఏం రాకూడదా!

వనజ— ఎందుకొచ్చావ్ చేసినపని చాలక...

పాప— అవసరం వుండి.

వనజ— పంతుల్ని అన్యాయం చేసింది చాలదూ, ముకుంద రావును అరెస్టు చేయించింది చాలదూ...ఇంకా ఎందర్ని నాశనం చెయ్యాలని.

పాప— పంతులు! ముకుందం?

వనజ— పాపం, అన్యాయం.

పాప— ఎవరిది అన్యాయం. నువ్వు చేసింది న్యాయమేనా... నీకోసం కలవరించిపోయ్యే ప్రాణిక అన్యాయం చెయ్యటం న్యాయమేనా!

వనజ— ఏమిటో కాకుకూతలు.

పాప— అవును, నేను నీకోసం ఎంతగా తపించిపోయానో నీకెలా తెలుస్తుంది. నిన్ను నా దాన్నిగా చేసుకోవాలని ఎంత

ప్రయత్నించాను... ఆ పంతులు ప్రతిసారీ అడ్డు తగుల్తూనే వచ్చాడు. ఇరవైనాలుగ్గంటలు ఇక్కడే వుండేవాడుగా...

**వనజ—** అందుకని ?

**పాప—** అందుకని అడ్డం తీసేసుకున్నాను. ఆ ముకుందరావు కుర్ర వెధవ. వాడ్ని కట్టుకోవటం నీకేంమంచిదిగాదు. ఇప్పుడు ఆ అడ్డంకూడా తీరింది. స్వేచ్ఛగా, హాయిగా...

**వనజ—** పాపయ్యా ! మర్యాదగా బయటకు నడువు. నీ యిష్టం వచ్చినట్లు విహరించడానికి...........

**పాప—** అబ్బో ఏం మర్యాద, ఏం గౌరవం... లేచివచ్చినదాని కూతురువు నీకూ మర్యాద వుందీ ! రోజుకు నలుగురితో కులికేదానికి నీకూ గౌరవం వుందా ! ఎవడైతేనేం నీకు కావలసింది డబ్బు... డబ్బుతో కొంటాను ... యింద డబ్బు తీసుకో.

**వనజ—** డబ్బు నీ వెధవడబ్బు నీదగ్గరే వుంచుకో ... వెంటనే యిక్కణ్నించి వెళ్ళిపో... బ్రతికదలుచుకుంటే.

**పాప—** ముకుందానికి తెలియదులే ... తెలియనియ్యను. రహస్యం ఇదంతారహస్యం. ఎవరికీచెప్పను ఫరవాలేదు.

**వనజ—** ఏయ్ దూరంగావుండు...ఏమిటా పోకిరితనం.

**పాప—** పోకిరితనం. ఎవరిదీ పోకిరితనం ? పంతుల్ని కట్టుకున్న నీ అమ్మదా, ఆ కుర్రవెధవను కట్టుకున్న నీదా ! నాదా పోకిరితనం ?

వనజ— ముయ్‌నోరు. ఆయన్ని అరెస్టు చేయించినంతమాత్రాన నేను నీకు లోబడతాననుకున్నావ్. అది ఎన్నటికీ జరగదు. కులం తక్కువైనంత మాత్రాన నీతి తక్కువదాన్ని కానవసరం లేదు...

పాప— నీతి! ఏం నీతి! ఎక్కడుంది?

వనజ— నీ పెళ్లాం నడిగితే చెబుతుంది ఎక్కడుందీ!

పాప— ఈ మాటలకేంగాని.

వనజ— ఊఁ.

పాప— నీ కోసం ఎంత త్యాగం చేశానో తెలుసుగా... ఎన్ని అడ్డంకుల్ని తప్పించుకున్నాను... ఎన్ని పరీక్షలకు లోనయ్యాను. అయినా నీకు దయ లేదు. నా మాటవిను. లేకపోతే చెడిపోతావ్!

వనజ— నీలాగ చెడిపోను!

పాప— వనజాన్... ఆలోచించుకో... పంతులుగారి ఏమైందో తెలుసుకో, నా దోవకు అడ్డున్న ముకుందం ఏమైనాడో ఆలోచించు. నీ గతి అంతకన్న కనాకష్టం అవుతుంది. ఏమైనా చెయ్యగలను. నీకు తెలియదు నువ్వు ఏమయ్యేది నాకు తెలుసు. ఎందుకు అనవసరంగా నాశనం అవుతావు.

వనజ— ఫరవా లేదు వెళ్ళండి.

పాప— ఎక్కడికి వెళ్ళేది ... వెళ్ళటానికి కాదు వచ్చింది. పాపయ్య తఢాకా చూపించటానికే వచ్చింది. (బలవంతం చేస్తాడు.)

వనజ— ఊఁ వొద్దులు. (చెంపపగిలేట్టు కొడుతుంది)

పాప— ఈచిన్ని దెబ్బకే బెదిరిపోతాననుకున్నావా... రా... రా...

మాధవయ్య, వెంకడు వస్తారు.

మాధ— వచ్చాను.

పాపయ్య బిత్తరపోతాడు

మాధ— ఏమిట్రా నువ్వు చేస్తున్న పని నీచుడా...

పాపయ్య రెండో చేతిలోవుండే పారిపోవడానికి ప్రయత్నిస్తాడు. కాని వీల్లేకపోతుంది.

మాధ— ఎంతమందిని అన్యాయంచేస్తావ్... ఎంతమంది నిట్లా పొట్టనబెట్టుకుంటావ్...

పాప— నేనేం అన్యాయంచేయు లేదు.

మాధ— బుకాయించబోకు నాకు తెలుసు నువ్వు చేసిన అన్యాయం.

పాప— అన్యాయం. నీకు నువ్వే అన్యాయంచేసుకున్నావ్...

మాధ— నీ మాట విని నాశనం అయ్యాను.

పాప— నా మాట వినమని నిన్ను నేనేం బ్రతిమలాడలేదు. నువ్వు తీసుకున్న గోతిలో నువ్వే పడ్డావు.

మాధ— ముయ్‌నోర్... చంపేస్తాను నోరెత్తావంటే దొంగ ముండాకొడకా... ఎదురుపలిచి మాట్లాడుతున్నావ్ సిగ్గులేక.

పాప— సిగ్గు!

మాధ— ఛీ! నీ ముఖంచూచినా పాపం చుట్టుకుంటుంది. ఫో అవతలకి... (వెళ్ళిపోతాడు)

వనజ— పగబట్టాడు!

మాధ— ఎందుకమ్మాయ్!

వనజ— పచ్చగా వుంటే చూచి ఓర్చలేక. తన కోర్కెను నెర వేర్చుకోవాలని.

మాధ— నన్ను నడిగంగలో ముంచాడు. దేనికైనా ముందుగా జాగ్రత్తపడటం మంచిది. అజాగ్రత్తవల్లనే మోసపోవలసి వచ్చింది.

వనజ— అనవసరంగా అనుమానించారు. మీ కొడుకు చెడిపోతున్నాడనే చెప్పుడు మాటలు నమ్మారు.

మాధ— అవును... చెడిపోయాడు. నిజంగానే చెడిపోయాడను కున్నాను.

వనజ— కానీ లేదుగా... చదువుకున్న వాడు, సంస్కారంకలవాడు ఎన్నటికీ చెడిపోడు. సంఘానికి ఎదురుతిరగటంవల్ల చెడిపోతున్నాడని పెద్దలు బాధపడతారు. కాని అభ్యుదయం కోసం పాటుపడేవారెవరూ అలా అనుకోరు. మీకు తెలియదు. లోకం ఎంతముందుకు పోతున్నదో... ఎప్పుడూ మీకు ఒక అడుగు వెనకేవుంటారు. పిల్లల భావాలతో కలుసుకోలేరు మీ పెద్దలు—

మాధ— నన్ను క్షమించమ్మా!

వనజ— ఛీ! అవేంమాటలండీ. తప్పుగాదూ!

మాధ— ఏంచెయ్యమంటావో చెప్పు చేస్తాను.

వనజ— మీ యిష్టం.

మాధ- అరేయ్ వెంకడూ

వెంక- అయ్యా !

మాధ- ఏం చెయ్యమంటావు ?

వెంక- తమరి యిష్టం బాబయ్యా... మీరేగా అబ్బాయిగార్ని అరెస్టు చేయించింది...

మాధ- నేనా... అదేమిటి !

వెంక- ఆ పోలీసాయన మీరు చేయించారనే చెప్పారండీ !

మాధ- అమ్మ కిరాతకుడా. ఎంతపని చేశావు ? పాపయ్య యింత ఘోరమైన అపచారం చేస్తాడని కలలో గూడా అనుకో లేదు.

వెంక- అయితే మీరు చేయించలేదంటారా !

మాధ- రామ, రామ ! ఏ పాపం ఎరగనురా భగవంతుడా ! ఎంతవిరోధినయినా కన్నకొడుకుని చేజేతులా పట్టిస్తానా ? అంత దుర్మార్గుణ్ణా నేను. నువ్వూ నమ్ముతున్నావా అమ్మాయ్.

వనజ- పాపయ్య చేసినపని అని తెలుస్తోనే వుంది.

మాధ- నీకు తెలుసన్నమాట.

వనజ- ఇప్పుడే అన్నారండీ... నాకోసం, నన్నేదో చేసి సాధించాలని ఇలా చేశాడుట... అప్పుడనుకున్నాను ... యిది పాపయ్య చేసినపని అని. మీరిచ్చినట్లుగా రిపోర్టు యిచ్చి పోలీసుల్ని తీసుకొచ్చాడన్న మాట.

మాధ- ఇప్పుడు ఏం చేసేట్టు ? రేపు వీడితల్లివస్తే ఏంచెపుతాను. నా కొడుకుని ఎందుకు అన్యాయం చేశావంటే !

వెంక– అమ్మగార్ని తీసుకురమ్మంటారండీ !

మాధ– ఏడ్చావ్ వుండరా ! తీసుకొస్తావ్ ? కొంపమునిగి. వాస్తే ఎట్టారా భగవంతుడా అని నేతస్తుంటే పోయి తీసుకొస్తావ్. ఏంరా నీ తెలివి.

వెంక– అదిగాదు బాబయ్య గారూ !

మాధ– ఇప్పుడు యింతకీ ఏం చేద్దాం చెప్పమ్మాయ్.

వనజ– మీ యిష్టం ఏం చేసినాసరే !

మాధ– సరేనేను పట్టణంపోయి వాణ్ని తీసుకొస్తాను.

వనజ– ఎట్లా !

మాధ– ఆ రిపోర్టు చేసింది నేగాదు. ఎవరో యిచ్చారంటాను.

వనజ– ఆ దుర్మార్గుడేనని చెప్పండి.

మాధ– వాడ్ని అరెస్టు చేస్తారుగా

వనజ– చెయ్యాలనేగా

మాధ– అఁ అట్టా చెప్పి తీసుకొస్తాను.

వనజ– వారు రారండీ !

మాధ– నేను స్వయంగా వెళుతున్నాగా. ఎందుకురాడు ?

వనజ– రారు !

మాధ– ఏం...ఎందుకురాడు. రాకూడదనుకున్నాడా !

వనజ– నా అనుమానం రారేమోనని ముందుగా ఆ పంతుల్ని విడిపిస్తేగాని తను రాడు.

మాధ— పోనీ అలాగేచేద్దాం...సరే వెళ్ళివస్తానమ్మా !

మాధవయ్య, వెంకడు వెళ్తారు

వనజ— నాకు ఆప్తులైన వాళ్ళందరూ వెళ్ళిపోయ్యారు. పవిత్ర ఆశయసాధనకోసం వెళ్ళారు. పాపయ్యలాంటి దుర్మార్గుల బారి పడకండా కాపాడుకోవాలి... యిలాగే వుంటాను... ముకుందరావు తిరిగివచ్చేవరకూ అతని ఆత్మశాంతికోసం కృషిచేస్తాను. ముకుందరావ్ ! నీకోసం ఈ వనజ బ్రతికివుంది నీ భావాలలో భాగస్వామిని. నన్ను నీకు అంకితంచేసుకో !

గీతం

మాయ మర్మంలేని నీ కొంప
కన్నులే కాల్చాలిరా
నీతి నియమంలేని లోకం
పోకడే మారాలిరా !
తండ్రిచేసిన తప్పులకు
తనయుండు బాధ్యుడు కాదురా
నిజానిజాలకు భేదముంటే
నీదె విజయం నమ్మరా !!

# ఛాయా చిత్రణ

## ( SHADOW SKETCH )

ముకుందరావు జైలులో పడ్డాడు. పాపయ్య దుర్మార్గం అతన్ని అరెస్టు చేయించింది. తండ్రి మాధవయ్య పేరున పోలీసు రిపోర్టు చేసి అమాయకుడైన ముకుందరావును పట్టించాడు. నిజానిజాలు తెలుసుకోలేని ప్రభుత్వం పాపయ్య మాటలు నమ్మింది. ముకుందరావు దేశద్రోహి అనే అనుమానం ఋజువు కాలేదు. పోలీసు వారికి ఋజువుతో నిమిత్తం లేదు. పదవులకోసం, ప్రమోషన్ల కోసం ప్రాకులాడే పోలీసు ఉద్యోగులకు నిజంతో నిమిత్తం లేదు. అడిగో ముకుందరావు. కటకటాల మధ్య ఎంతో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. బహుశః తన దుర్గతిని గురించి విచారిస్తున్నాడేమో! కాదు. భవిష్యత్ కర్తవ్యాన్ని గురించి సమాలోచిస్తున్నాడు. సంస్కృతి నాగరకతలకు పట్టుకొమ్మలుగావున్న పల్లెటూళ్ళు ఇలాంటి అన్యాయాలకు అక్రమాలకు ఆహుతి అయిపోయాయేమో అని ఆలోచన.

ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చాడు. తండ్రి అయిన మాధవయ్యలో కలిగిన మార్పు కొడుకును రక్షించుకోవాలనిపించింది. అడిగో మాధవయ్య. పోలీసు అధికారితో సంప్రదిస్తున్నాడు. జాలిగా అడుగుతున్నాడు. ప్రాధేయపడుతున్నాడు. కాళ్ళవేళ్ళపడి బ్రతిమలాడుకుంటున్నాడు. కంట తడిపెట్టినా అధికారి హృదయం కరగలేదు. కర్కశంగా కాదన్నాడు.

పోనీ ఒక్కసారి కొడుకుని చూడనిమ్మని అడిగాడు. అందుకు అనుమతించారు. ముకుందరావును కావలించుకుని ఏడ్చాడు. కన్నకొడుకును జైలులో వేయించాడనే అపనింద మోయటం ఎలా! 'ఇదేంపనయ్యా' అని లోకులు అడిగితే తనేం సమాధానం చెప్పగలడు. నిరాశతో, దిగులుతో క్రుంగిపోయ్యాడు పాపం! మాధవయ్య హృదయంలోని బాధ ఎవరికి అర్థం అవుతుంది. కొడుకుల్ని కన్న ఎందరు తండ్రులు అర్థం చేసుకోగలరు!

మాధవయ్యా! లే...లాభంలేదు... ఫలితం శూన్యం. మధ్య వాళ్ళని నమ్మి మోసపోయ్యావ్ ఇప్పుడు విచారించి లాభం లేదు. నీకూ, నీ కొడుక్కీ ఋణంతీరిపోయింది...పద...... ముందుకునడు...ఎందుకు యింకా వెనుదిరిగి చూస్తావ్... లాభంలేదు బాబూ...బ్రతికినంతకాలం అలా కుమిలి కుమిలి ఏడువు... చేసిన పాపం అనుభవించక తప్పదు......... గుడ్డిగా నమ్మి మోసపొయ్యే మనుషులు ఇలాగే బాధపడాలి! నీ కొడుకు తిరిగి వస్తాడనే నమ్మకంలేదు. ఏమవుతాడో ఎవరు చెప్పగలరు. ఏ కొండకొమ్మనో, అడవి చివరనో ఎర్ర తుపాకికి ఆహుతి కాగలడు. నీకు నిరాశ ఒక్కటే శరణ్యం. న్యాయం కోసం పాటుబడ్డ కొడుకుని తలుచుకో...... ఊహించుకుని తరించు...నిజానిజాలతో ప్రసక్తిలేని ప్రభుత్వం ఏమీ న్యాయం చెయ్యజాలదు, చెయ్యదు!

అయిపోయింది.

---

జైహింద్ ప్రెస్, తెనాలి. 1953.

